

గుంటూరు కలెక్టరేట్ వద్ద మిర్చి రైతుల సామూహిక దీక్షలనుద్దేశించి మాట్లాడుతున్న ఎమ్మెల్సీ కె.ఎస్.లక్ష్మణరావు




మిర్చి రైతులకు పరిహారం ఇవ్వాలని కోరుతూ జంగారెడ్డి గూడెం ఆర్డీవో కార్యాలయం వద్ద ధర్నా




మిర్చి రైతులకు పరిహారం కోరుతూ కృష్ణాజిల్లా జుజ్జూరులో ప్రదర్శన



సత్తెనపల్లి ప్రాంతంలో తెగుళ్లతో ధ్వంసమైన మిరప తోటలను పరిశీలిస్తున్న ఎమ్మెల్సీ, రైతు సంఘ రాష్ట్ర నేతలు



ఉరవకొండలో ఎండిపోతున్న వేరుశనగ పైరును పరిశీలిస్తున్న ఎపి కౌలు రైతు సంఘం ఉపాధ్యక్షుడు వి.శ్రీనివాసరావు తదితర రైతు సంఘ నేతలు



సత్తెనపల్లి ప్రాంతంలో ధ్వంసమైన మిర్చి పైరును పరిశీలిస్తున్న రైతు సంఘం ఉపాధ్యక్షులు వి.కృష్ణయ్య, ఇతర నేతలు



బాధిత మిర్చి రైతులకు సాయం చేయనందుకు దాచేపల్లిలో మిర్చి దహనం చేస్తూ నిరసన



జాదూ పత్తి విత్తనాలతో నష్టపోయిన రైతులు పాణ్యంలో నిర్వహిస్తున్న రాస్తారోకో

మన
# రైతువాణి
మార్చి - 2022
సంపుటి : 32 సంచిక : 3
వెల : రూ. 25 పేజీలు : 52
సంవత్సర చందా : రూ. 250/-



మన రైతువాణి
3/4బి, వడ్డేశ్వరం బైపాస్, వడ్డేశ్వరం (పోస్ట్)
తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా
పిన్ : 522 502
E-mail : rytuvani@gmail.com

చెక్కులు, డి.డి లు Mana Rytu vani
పేరుతో పంపాలి.
SBI Ac No : 52024133051
IFSC : SBIN0020343

# విషయసూచిక



నా పొలంలో నుంచి పో... బయటకు
నీరు
పెట్టుబడిదారుడు
YUSUF




భారత దేశంలో మహిళలు అగ్రగామిగా కొనసాగుతున్నారు.
హెల్ప్...హెల్ప్...
SATISH ACHARYA


# గీతోపదేశాలు



కిస్సా కుర్సీ కా
వ్యవసాయ చట్టాలు రద్దు
రైతు సంఘాలు
వ్యవసాయ చట్టాలు
5 రాష్ట్రాల ఎన్నికలు
UTTAM




కనీస మద్దతు ధర




భారతీయ రూపాయి
పెట్రోల్, డీజిల్ ధరలు
అచ్ఛే దిన్
ఆర్థిక వ్యవస్థ
UTTAM

సంపాదకీయం... 

# మద్దతు ధరలు - ప్రభుత్వాల జోక్యం

ఖరీఫ్ మార్కెట్ సీజను ముగిసింది. రబీ మార్కెట్ సీజను ప్రారంభమైంది. ఈ యేడు ఖరీఫ్ సీజను మొత్తం రైతులకు నష్టాలు మూటగట్టి ఇచ్చింది. అకాల వర్షాలకు 13.5 లక్షల ఎకరాల్లో పంటలు దెబ్బతిన్నాయి. 5.50 లక్షల ఎకరాల్లో మిర్చి పంటకు వైరస్ సోకి రైతులకు తీవ్రమైన నష్టాలను మిగిల్చింది. కావేరి కంపెనీ జాదూ పత్తి విత్తనం రైతాంగాన్ని తీవ్రంగా నష్టపరిచింది. అనంతపురం జిల్లాలో ప్రధానమైన వేరుశనగ పంట కూడా నష్టాలనే అప్పగించింది. చేతికి వచ్చిన పంటలు సైతం అమ్ముకోవడానికి రైతాంగం అష్టకష్టాలు పడాల్సి వచ్చింది.

రాష్ట్రంలో ప్రధానమైన వరి ధాన్యం ప్రతి గింజనూ రైతు భరోసా కేంద్రాల ద్వారా కొంటామని, మూడు రోజుల్లో పైకం చెల్లిస్తామని రాష్ట్ర ప్రభుత్వం హామీ ఇచ్చింది. ఆచరణలో రైతు భరోసా కేంద్రాలు రైసు మిల్లర్ల ఏజెన్సీలుగా మారిపోయాయి. తేమ, తాలు, తూకం దగ్గర నుంచి ధర నిర్ణయించడం వరకూ అన్నింటిలోనూ మిల్లర్ల పెత్తనమే సాగింది. రంగు మారిన ధాన్యం బస్తా ఏడెనిమిది వందల రూపాయలకు అమ్ముకోగా.. మంచి ధాన్యం మూడు వందలు తక్కువకు అమ్ముకోవాల్సి వచ్చింది. ఉత్తరాంధ్రలో క్వింటాలుకు పది కిలోల ధాన్యాన్ని అదనంగా తూకం వేసుకున్నారు. 45 లక్షల టన్నుల ధాన్యం కొనుగోలు లక్ష్యంగా ప్రకటించిన రాష్ట్ర ప్రభుత్వం 37 లక్షల టన్నులతోనే సరిపెట్టింది. నెల దాటిపోయినా ఇంకా రైతులకు రూ.2,400 కోట్లు చెల్లించాల్సి ఉంది. అరటి, ఉల్లి, బెల్లం, కొబ్బరి తదితర పంటల ధరలు పడిపోయినా ప్రభుత్వం జోక్యం చేసుకోలేదు.

కేంద్ర ప్రభుత్వం 2020-21 వ్యవసాయ సీజనులో 197 లక్షల మంది రైతుల నుండి ధాన్యం సేకరించగా.. ఈ యేడాది ఖరీఫ్‌లో 163 లక్షల మంది నుంచే సేకరించింది. 34 లక్షల మంది రైతులు అయినకాడికి అమ్ముకోవాల్సి వచ్చింది. మార్కెట్ జోక్యం పథకానికి నిరుడు రూ.3,596 కోట్లు కేటాయించగా.. ఈ యేడు రూ.1500 కోట్లే కేటాయించింది. మద్దతు ధర పొందలేని రైతులకు ముదరా ఇచ్చే పి.ఎం ఆషా పథకానికి కేవలం కోటి రూపాయలు మాత్రమే కేటాయించింది. ఈ ఏడాది బాయిల్డు రైస్ కొనబోనని ప్రకటించింది. కేంద్ర ప్రభుత్వం పంటల కొనుగోలును తగ్గించేస్తూ రాష్ట్రాలపై కూడా ఆంక్షలు విధించింది. కేంద్రంపై పోరాడి నిధులు సాధించుకోవాల్సిన రాష్ట్ర ప్రభుత్వం వేడుకోవడంతోనే సరిపెడుతోంది. రైతులకు ధాన్యం బకాయిలు చెల్లించడానికి డబ్బులేని రాష్ట్ర ప్రభుత్వం.. కేంద్ర ప్రభుత్వ వత్తిడికి లొంగి అవసరంలేని వ్యవసాయ పంపుసెట్లకు మీటర్లు ఏర్పాటు చేయడానికి రూ.3,700 కోట్లు ఖర్చు చేయడానికి సిద్ధపడటం ఏమాత్రం వాంఛనీయం కాదు.

మార్చి నుంచి నెల్లూరు, ఉభయ గోదావరి జిల్లాల్లో దాళ్వా ధాన్యం; పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, కర్నూలు జిల్లాల్లో మొక్కజొన్న, జొన్న; కృష్ణా, కర్నూలు జిల్లాల్లో మినుములు, ఇతర అపరాలు; ప్రకాశం, కడప, అనంతపురం జిల్లాల్లో శనగలు, పొగాకు, పసుపు మార్కెట్లు రాబోతున్నాయి. ఉద్యాన పంటలైన జీడి మామిడి తదితర పంటలు కూడా మార్కెట్‌కు రానున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం తన ఖరీఫ్ వైఫల్యాన్ని పునరావృతం చేయకుండా వెంటనే కొనుగోలు కేంద్రాలు ప్రారంభించాలి. అవసరమైన నిధుల కోసం రాష్ట్ర ప్రభుత్వం.. కేంద్రంపై వత్తిడి పెంచాలి.

# పంట బీమా తోటే మిర్చి రైతుకు ధీమా





వై. కేశవరావు

రాష్ట్ర ప్రభుత్వం గతేడాది జూన్ 15న విడుదల చేసిన జీవో ఎమ్.ఎస్ నెం 35 ప్రకారం .. గుంటూరు, కర్నూలు, కృష్ణా జిల్లాలలో మిర్చి పంటకు బీమా లేదు. రాష్ట్రంలో 75 శాతం పంట ఈ మూడు జిల్లాలలోనే సాగు అవుతుంది. ఈ ఏడాది పంటల బీమా ప్రీమియం చెల్లించలేదని వార్తలు వెలువడుతున్నాయి. అధికారులు ఎవరూ పెదవి విప్పడం లేదు. పంటల బీమా సంగతి ప్రశ్నిస్తే రైతులను ఆదుకుంటామని, నష్టపరిహారం ఇస్తామని చెప్పి దాటవేస్తున్నారు.

మన రాష్ట్రంలో మిర్చి సాగు చేసిన రైతాంగం ఏనాడూ లేనంత కష్టాలలో ఉంది. పూత, పిందె దశలో ఉన్న మిరప పంటకు తామర వైరస్ సోకడంతో ఎన్నడూ ఎరుగనంత నష్టం జరిగింది. మిరప చేలన్నీ నిలువునా మాడిపోయాయి. ఎన్ని క్రిమిసంహారకాలు వాడినా ఫలితం లేకపోయింది. గత ఏడాది మిర్చి దిగుబడులు బాగున్నాయి. ధరలు కూడా బాగున్నాయి. రైతాంగం గతంలో చేసే సాగుకన్నా ఎక్కువగా మిర్చి సాగు చేశారు. రాష్ట్రంలో మిర్చి పంట సగటు సాగు విస్తీర్ణం 3.80 లక్షల ఎకరాలు కాగా ఈ ఏడాది 5.25 లక్షల ఎకరాలు సాగు చేశారు.

రైతు ఎకరాకు లక్ష రూపాయలకు పైగా పెట్టుబడి పెట్టగా కౌలు రైతు అదనంగా ఎకరాకు రూ.30 వేలు పైగా ముందస్తుగానే కౌలు చెల్లించారు. కౌలు రైతులకు బ్యాంకుల నుండి రుణాలు రాకపోవడంతో అధిక వడ్డీలకు తెచ్చి పెట్టారు. అప్పుల బాధకు తాళలేని పేద రైతుల, కౌలు రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఈ రెండు మాసాలలోనే ప్రకాశం, గుంటూరు, కృష్ణా, జిల్లాలలో 20 మంది పైగా రైతులు ఆత్మహత్యలు చేసుకుని చనిపోయారు. బలవన్మరణాలకు పాల్పడిన కుటుంబాలు తల్లడిల్లిపోతుండగా, నిత్యం వస్తున్న ఆత్మహత్యల వార్తలు రైతాంగాన్ని మరింత కుంగదీస్తున్నాయి.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన శాస్త్రవేత్తల బృందం పర్యటన జరిపి రెండు మాసాలు గడిచింది. ప్రభుత్వాల నుండి ఇంతవరకు ఏ సమాచారం లేదు. ఒక్క ఆంధ్రప్రదేశ్ లోనే సుమారు రూ. 6 వేల కోట్లు పెట్టుబడి హారతి అయిపోయింది. సవ్యంగా ఉంటే కనీసం రూ. పది వేల కోట్ల ఖరీదు చేసే మిరప పంట దిగుబడి అయ్యేది. అయినా కేంద్ర ప్రభుత్వం తాత్సారంగా వ్యవహరించడం క్షంతవ్యం కాదు.

రాష్ట్ర ప్రభుత్వం గతేడాది జూన్ 15న విడుదల చేసిన జీవో ఎమ్.ఎస్ నెం 35 ప్రకారం ...రాష్ట్రంలో ఏ ఏ పంటలకు, ఏ ఏ జిల్లాలకు పంటల బీమా పథకం వర్తించేది ఇచ్చింది. ఆ జీవో ప్రకారం గుంటూరు, కర్నూలు, కృష్ణా జిల్లాలలో మిర్చి పంటకు బీమా లేదు. రాష్ట్రంలో 75 శాతం పంట ఈ మూడు జిల్లాలలోనే సాగు అవుతుంది. ఈ ఏడాది పంటల బీమా ప్రీమియం చెల్లించలేదని వార్తలు వెలువడుతున్నాయి. అధికారులు ఎవరూ పెదవి విప్పడం లేదు. పంటల బీమా సంగతి ప్రశ్నిస్తే రైతులను ఆదుకుంటామని, నష్టపరిహారం ఇస్తామని చెప్పి దాటవేస్తున్నారు.

### ప్రధానమంత్రి ఫసల్ బీమా యోజన పథకం

2016లో కేంద్రప్రభుత్వం అప్పటి వరకు అమలులో ఉన్న జాతీయ వ్యవసాయ పంటల బీమా పథకం వాతావరణ విపత్తుల పంటల బీమా పథకం, మోడిఫైడ్ పంటల బీమా పథకాలను కలిపి ప్రధానమంత్రి ఫసల్ బీమా యోజన పథకం ప్రవేశపెట్టింది. 2016లో మధ్యప్రదేశ్‌లో ఈ పథకం ప్రారంభిస్తూ ప్రధానమంత్రి నరేంద్రమోడీ ఈ పథకం వలన పంట నష్టపడిన ప్రతి రైతుకూ బీమా పరిహారం వస్తుందని చెప్పారు. అదే రాష్ట్రంలో 2019లో మహేశ్ జాగేశ్వర్ రామ్‌కుచే అనే రైతు 1.27 హెక్టారులలో సోయాబీన్ పంట వేసి పూర్తిగా నష్టపోయాడు. అయితే కేవలం 2 రూపాయలు మాత్రమే పంటల బీమా కంపెనీ నుండి పరిహారం వచ్చిందని, ఏటా తన కిసాన్ క్రెడిట్ కార్డు అకౌంట్ నుండి రూ.12,000 కట్ అవుతుందని చెప్పారు.

ఈ పథకం ప్రకారం రైతు ఆహార, పప్పుధాన్యాల పంటలకు ఖరీఫ్‌లో 2 శాతం... రబీలో 1.5 శాతం ప్రీమియం చెల్లించాలి. ఉద్యాన వాణిజ్య పంటలకు 5 శాతం ప్రీమియం చెల్లించాలి. మిగిలిన ప్రీమియం మొత్తం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 50 శాతం చొప్పున చెల్లించాలి. రైతులు బ్యాంకులో తీసుకునే పంటరుణం (స్కేల్ ఆఫ్ ఫైనాన్స్) ఆధారంగా ప్రీమియం వసూలు చేస్తారు. ఈ పథకం అమలుకు ప్రభుత్వ సంస్థ అయిన అగ్రికల్చరల్ ఇన్సూరెన్స్ కంపెనీ ఆఫ్ ఇండియాతో పాటు, పది ప్రైవేటు పంటల బీమా కంపెనీలను ఎంపిక చేసింది. ఈ కంపెనీలకు జిల్లాల వారీగా కేటాయింపులు చేసింది. 2018లో బీమా కంపెనీలు రైతులకు బీమా పరిహారం చెల్లించడం లేదని పార్లమెంట్‌లో చర్చ జరిగింది. ఆ సందర్భంగా ఇన్సూరెన్స్ కంపెనీలకు రూ.15,000 కోట్లు పైగా ప్రీమియం వసూలు అయ్యిందని, రైతులకు రూ.5,000 కోట్లు మాత్రమే పరిహారంగా చెల్లించాయని, ప్రయివేటు కంపెనీలు ఒక్కొక్క దానికి రూ.1000 కోట్లు చొప్పున లాభాలు వచ్చాయని, ప్రభుత్వ కంపెనీ అయిన అగ్రికల్చరల్ ఇన్సూరెన్స్ కంపెనీ ఆఫ్ ఇండియా ఒక్కటే పూర్తిగా నష్టపరిహారం చెల్లించిందని తేలింది. వ్యవసాయ అధికారులు పంటల దిగుబడి సర్వే సక్రమంగా చేయడం లేదని తమ కంపెనీల అధికారులతో నమూనా సేకరించామని దాని ప్రకారం పంటలు బాగానే పండాయని ప్రయివేటు కంపెనీలు వాదించాయి. ఈ పథకం ప్రకారం పంట మధ్య కాలంలో పంట నష్టం జరిగితే బీమా మొత్తంలో 25 శాతం వెంటనే చెల్లించాలన్న షరతు ఉంది. ఇప్పటి వరకు ఈ షరతు ఎక్కడా అమలు పరిచిన దాఖలాలు లేవు. రాష్ట్ర ప్రభుత్వాలు చెల్లించే ప్రీమియం ఎక్కువగా ఉందని, కంపెనీలు చెల్లించే బీమా పరిహారం తక్కువగా ఉందని వ్యవసాయక రాష్ట్రాలయిన ఆంధ్రప్రదేశ్, జార?ండ్, తెలంగాణ, బీహార్, గుజరాత్, పంజాబ్, పశ్చిమ బెంగాల్ 7 రాష్ట్రాలు ఈ పథకం నుండి వైదొలుగుతున్నట్లు ప్రకటించాయి. కొన్ని రాష్ట్రాలు స్వంతంగా ఇన్సూరెన్స్ కంపెనీలను స్థాపించుకున్నాయి. ఈ కంపెనీలకు కేంద్రం ప్రీమియం చెల్లించడం లేదు.

## వై.ఎస్.ఆర్ ఉచిత పంటల బీమా పథకం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2019లో జీవో నెం 157 ద్వారా 2013 కంపెనీ యాక్ట్ కింద "ఆంధ్రప్రదేశ్ జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ లిమిటెడ్" ను ఏర్పాటు చేసింది. 101 కోట్లతో ప్రభుత్వ షేర్ క్యాపిటల్ ఏర్పాటు చేసింది. రైతు ఒక్క రూపాయి కడితే చాలని చెప్పింది. 2020 అక్టోబర్‌లో జీవో నెం 79 ద్వారా రాష్ట్రంలో ఏ జిల్లాలో ఏ పంటలకు బీమా వర్తించేది గ్రామాల వారీగా వివరాలిచ్చింది. పరిహారం చెల్లించింది. 2021 జూన్‌లో జీవో నెం 35 విడుదల చేసింది. 540 పేజీలు ఉన్న ఆ జీవోలో ఏ జిల్లాలో ఏ పంటకు బీమా వర్తించేది మండలాల వారీగా, గ్రామాల వారీగా, పంటలవారీగా ప్రకటించింది. మన రాష్ట్రంలో మిరప పంట గుంటూరు, ప్రకాశం, కర్నూలు, కృష్ణా జిల్లాలు ప్రధానం. ఈ జిల్లాలలో మిరప పంటను బీమా నుంచి మినహాయించింది. ఇక్కడే 75 శాతం పంట ఉంటుంది. నవంబరు నుండి మిర్చి పంటకు తామర వైరస్ సోకి పంట



మాడిపోతున్న విషయం తెలిసిందే. కేంద్ర పంటల బీమా పథకం ప్రకారం పంట మధ్యకాలంలో నష్టం వాటిల్లితే బీమా మొత్తంలో 25 శాతం వెంటనే చెల్లించాలని షరతు ఉంది. ప్రస్తుతం మన రాష్ట్రంలో ఈ క్లాజు అమలు పరచాల్సి ఉంది. అయినా ప్రభుత్వం ఇప్పటి వరకూ పంటల బీమా పథకం విషయం మాట్లాడడం లేదు. మంత్రుల ప్రకటనలలో ఆదుకుంటామని మాత్రమే చేప్తున్నారు.

## పంట నష్టపరిహారం

ఎకరాకు లక్ష రూపాయలకు పైగా పెట్టుబడి పెట్టిన రైతుకు ఎకరాకు రూ.6000 ఇన్‌పుట్ సబ్సిడీ ఇస్తే తీరేది కాదు. కేంద్రప్రభుత్వం భూపేంద్రసింగ్ హుడా అధ్యక్షతన కమిషన్‌ను నియమించింది. ఆ కమిషన్ పంట నష్టపరిహారాలకుగానూ ఆనాటి ధరల పట్టిక ప్రకారం ఆహార పంటలకు ఎకరాకు రూ.10 వేలు ఇవ్వాలని 2010లో సూచించింది. ఇప్పటికి 12 సంవత్సరాలు గడిచింది. ఈ కాలంలో వ్యవసాయ పెట్టుబడులన్నీ అనేక రెట్లకు పైగా పెరిగాయి. అయినప్పటికీ ఇన్‌పుట్ సబ్సిడీ ఎకరాకు రూ.6000 గానే ఉంది (కేంద్ర ప్రభుత్వం ఇచ్చే ఇన్‌పుట్ సబ్సిడీ కేవలం ఎకరాకు రూ.2250 గానే ఉంది). రాష్ట్ర ప్రభుత్వం రూ.6000 ఇన్‌పుట్ సబ్సిడీ ఇచ్చి సరిపెట్టాలని చూడడం సరైంది కాదు. వైఎస్ఆర్ పంటల బీమా చట్టం ప్రకారం మొత్తం బీమా పరిహారం చెల్లించాల్సి ఉంది. మిర్చి పంట 7 రాష్ట్రాలకు విస్తరించి ఉంది. ఒక్క ఆంధ్ర రాష్ట్రంలోనే రూ. 6 వేల కోట్లు పైగా పెట్టుబడులు తుడిచిపెట్టుకు పోయాయి. మొత్తం 7 రాష్ట్రాలలో మిర్చి పంట నాశనమైంది. కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వ పంటల బీమా కంపెనీ తమకు సంబంధం లేదనే వైఖరిలో ఉండడం సరైంది కాదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ రైతాంగానికి సంపూర్ణ పంట బీమా పరిహారం చెల్లించాల్సి ఉంది. లేదా అందుకు సమానంగా నష్టపరిహారం ఇవ్వాలి.

రైతాంగం ఆత్మహత్యలకు పాల్పడడం సమస్యకు పరిష్కారం కాదు. పోరాడితే సాధించవచ్చని గత ఏడాది పాటు జరిగిన రైతు ఉద్యమ అనుభవం మన ముందు ఉన్నది. అందువలన రైతాంగం పూర్తి పంటల బీమా పరిహారం సాధించేవరకూ పోరాడాల్సి ఉంది.

**(వ్యాసకర్త : ఏ.పి రైతు సంఘం అధ్యక్షుడు )**



# ధాన్యం రైతుకులేని దన్ను

కొన్నేళ్ల కింద పల్లె సమాజంలో వరి పండించే రైతంటే గొప్ప. ఇప్పుడు ధాన్యం రైతు ఎందుకూ కొరగావడంలేదు. పండించిన ధాన్యాన్ని కొనే నాథుడే లేడు. గిట్టుబాటు ధర కలలో మాట. ప్రభుత్వం ప్రకటించిన కనీస మద్దతు ధర (ఎంఎస్పి) లక్కీ ఛాన్సే. ప్రతి గింజకూ ఎంఎస్పి ఇచ్చి తీరతామన్న సర్కారీ శపథాలు మీడియా వార్తలకే పరిమితం. ఎప్పటిలాగానే ఈ ఖరీఫ్‌లోనూ ధాన్యం సేకరణకు ప్రభుత్వం ఆర్భాటంగా ప్లాన్ చేసింది. సీజన్‌లో 80 లక్షల టన్నుల ధాన్యం ఉత్పత్తి జరుగుతుందని అంచనా వేసి, 50 లక్షల టన్నులు పౌర సరఫరాల శాఖ సేకరిస్తుందన్నారు. గ్రామాల్లోని రైతు భరోసా కేంద్రాలే (ఆర్‌బికె) ధాన్యం కొనుగోలు కేంద్రాలనీ టముకేశారు. అక్కడ రిజిస్ట్రేషన్ చేయించుకున్నాక ధాన్యాన్ని రైతులు మిల్లర్లకు చేర్చాలి. ఇ-క్రాప్, భూమిపత్రాలు, ఆధార్, బ్యాంక్ అకౌంట్, వగైరా వగైరా కచ్చితంగా స్పష్టంగా ఉంటేనే ఆర్‌బికెలలో నమోదు సాఫీగా జరుగుతుంది. లేకపోతే అక్కడే బ్రేక్ పడుతుంది. కౌలు రైతులకు ఎలాగూ రికార్డులు ఉండవు కనుక వారికి ఆర్‌బికెలలో నో ఎంట్రీ. ఆర్‌బికె సిబ్బంది కౌలు రైతులను తమ వ్యక్తిగత పూచీకత్తుపై గుర్తించాలి. అదీ కాదంటే భూమి యజమానుల బ్యాంక్ అకౌంట్‌లో డబ్బులు పడతాయి. తమ డబ్బు కోసం యజమానులను బతిమాలాలి. ఈ ఇక్కట్లు భరించలేకే కౌల్దార్లు బేరగాళ్లకు అయినకాడికి ధాన్యాన్ని తెగనమ్ముకొంటున్నారు. ఫలితంగా నష్టపోతున్నారు.

రెండేళ్లుగా సర్కారీ కొనుగోలు కేంద్రాలంటే రైతులు భయపడిపోతున్నారు. ధాన్యం ఇచ్చాక 21 రోజుల్లో రైతుల బ్యాంక్ అకౌంట్లలో రొక్కం పడుతుందనే హామీ ఎక్కువ సందర్భాల్లో ఆచరణకు నోచుకోవట్లేదు. ముందటేడు, నిరుడు కోవిడ్ ఫస్ట్, సెకెండ్ వేవ్ కారణంగా రబీ పంటకు మార్కెట్ సదుపాయాలు పూర్తిగా స్తంభించాయి. రైతులు ప్రభుత్వానికి ధాన్యం ఇస్తే నెలల పర్యంతం డబ్బు చెల్లించలేదు. బకాయిల కోసం రైతులు రోడ్డెక్కాల్సి వచ్చింది. ప్రభుత్వం ఈ అనుభవాల నుండైనా గుణపాఠాలు తీసుకోలేదని ప్రస్తుత ఖరీఫ్ సేకరణను చూస్తే తెలుస్తుంది. ఐదు వారాల క్రితం దాదాపు 12-13 లక్షల టన్నులిచ్చిన రెండు లక్షల మంది రైతులకు రూ.2,500 కోట్లు చెల్లించాలి. సివిల్ సప్లయిస్‌కు ప్రభుత్వం డబ్బులివ్వకుండా నిధులు సమకూర్చుకోమనడంతో బ్యాంక్ రుణాలు సకాలంలో అందలేదు. దాంతో ధాన్యం సేకరణను తగ్గించారు. నిరుడు ఈ సమయానికి 40 లక్షల టన్నులు సేకరించగా, ఈ ఏట 36 లక్షల టన్నులే సేకరించారు. రూ.3 వేల కోట్ల రాష్ట్ర ధరల స్థిరీకరణ నిధి, కేంద్రానికి చెందిన సెంట్రల్ మార్కెట్ ఫండ్, ఆహార భద్రతా చట్టం నిధులు ఏమై పోతున్నాయో తెలీదు. రాష్ట్రం నుండి ఎఫ్‌సిఐకి బియ్యం సేకరించి పెట్టగా, ఆ నిధులు వేల కోట్లు ఇవ్వకుండా కేంద్రం బకాయి పెట్టింది. కేంద్రం నుండి బకాయిలను రాబట్టడంలో ఎపి సర్కారు గట్టిగా ఒత్తిడి చేయడం లేదు.

క్వింటాలు ధాన్యం పండించడానికి రైతుకయ్యే ఖర్చు రూ.2 వేలు. స్వామినాథన్ కమిషన్ సిఫారసుల మేరకు రైతుకయ్యే వ్యయానికి 50 శాతం కలిపి ఎంఎస్పి లెక్కిస్తే రూ.3 వేలు అవుతుంది. కేంద్రం ఇచ్చింది రూ.1,960. మునుపటేడాది కంటే పెంచింది రూ.72 మాత్రమే. ఇదే సమయంలో కాంప్లెక్స్ ఎరువులు బస్తాకు రూ. రెండు మూడొందలు పెరిగాయి. డీజిల్, పెట్రోలు ధరల మోతతో అన్ని ఖర్చులూ తడిసి మోపెడయ్యాయి. ఇన్ని వ్యయ ప్రయాసలకోర్చి పంట పండిస్తే రైతుకు గిట్టుబాటు సంగతేమో గాని, పెట్టుబడి సైతం రావట్లేదు. అన్ని తరుగులూ, రవాణా ఛార్జీలు, అమాంబాపతు కమీషన్లూ పోను క్వింటాలుకు రూ.1600-1,700 రావడం గగనమవుతోంది. దళారులు, వ్యాపారులకు అమ్ముకుంటే నష్టం చెప్పనలవి కాదు. విపత్తుల వలన పంట దెబ్బ తింటే అదీ రాదు. నవంబర్ వర్షాలకు ఐదు లక్షల ఎకరాల్లో వరి దెబ్బతింది. ఐదారు లక్షల టన్నుల ఉత్పత్తి నష్టం జరిగింది. రాష్ట్రంలో కొన్నేళ్లుగా కొనసాగుతున్న వ్యవసాయ సంక్షోభానికి కోవిడ్ విలయం తోడై రైతు బతుకు ఛిద్రమైంది. క్లిష్ట సమయంలో రైతుకు ప్రభుత్వ దన్ను అత్యావశ్యం. ఆహార పంటలను సేకరించలేకపోతే రైతులతో పాటు ప్రజల ఆహార భద్రత ప్రమాదంలో పడుతుంది. రైతు రక్షణ, ప్రజల ఆహార భద్రత ప్రభుత్వ కనీస బాధ్యత. ఈ బాధ్యతను నెరవేర్చకుంటే ఎన్ని గొప్పలు చెప్పుకున్నా నిష్ప్రయోజనం. *

# కౌలు రైతులను పట్టించుకోని కేంద్ర సర్కార్

రైతుల ఆదాయం పెరగాలంటే ముందుగా రైతు వ్యవసాయ ఖర్చులు ప్రభుత్వం తగ్గించాల్సి ఉంటుంది. అలాగాక ఇప్పటికే కేంద్ర ప్రభుత్వం బడ్జెట్లో వ్యవసాయ రంగానికి కేటాయింపులు భారీగా కోతలు విధించింది. రైతాంగం పట్ల కక్షగట్టి వ్యవహరిస్తోంది. ఏడాదిపాటు జరిగిన రైతాంగం ఉద్యమం సందర్భంగా ఇచ్చిన హామీలనూ తుంగలో తొక్కింది. ఇచ్చిన వాగ్దానాలు అమలు చేయకుండా రైతులను అవమానపరిచింది. రైతు అమరవీరుల కుటుంబాలకు పరిహారం ఇవ్వకుండా మోసగించింది. వ్యవసాయం గిట్టుబాటుగాక రైతులే తమంతట తాము వ్యవసాయం వదిలేసే విధంగా బడ్జెట్లో కోతలు పెట్టింది. కార్పొరేట్ సంస్థలు లాభపడే విధంగా బడ్జెట్కు రూపకల్పన చేసింది. ప్రజలకు అమృత కాలమని చెపుతూ రాహు కాలానికి ద్వారాలు తెరిచింది.

ఉత్పాదకతను పెంచి గిట్టుబాటు ధరలు ఇవ్వాలని, కనీస మద్దతు ధరల ప్రకారమైనా పంటలను కొనుగోలు చేయాలని రైతు సంఘాలు డిమాండ్ చేస్తున్నా పట్టించుకోవడం లేదు. దేశంలో సుమారు 52 పంటలకు మద్దతు ధర ప్రకటించాలని విజ్ఞప్తులు చేస్తుండగా కేవలం 14 పంటలకే ప్రకటించి.. వరి, గోధుమలను మాత్రమే సేకరిస్తోంది. నిరుడు రూ.2.48 లక్షల కోట్లు కేటాయించగా ఈ యేడు గతంలో కేటాయించిన దానికంటే రూ.11 వేల కోట్లు తగ్గించారు. దీని ప్రభావం పంటల కొనుగోలుపై పడుతుంది. అంటే భవిష్యత్తులో పంటలను కొనుగోలు చేయడానికి కేంద్ర ప్రభుత్వం ముందుకు రాదని స్పష్టమవుతోంది. డాక్టర్ స్వామినాథన్ సిఫార్సుల ప్రకారం మద్దతు ధరల గ్యారెంటీ చట్టం తీసుకురావడంలో కేంద్ర ప్రభుత్వం విఫలమైంది. కొనుగోలు చేసే పంటలను కూడా కౌలు రైతుల నుండి కొనుగోలు చేయటం లేదు. అలాంటప్పుడు కౌలు రైతులకు కనీసం పెట్టుబడి ఖర్చులూ వచ్చే పరిస్థితి లేదు.

మార్కెట్ జోక్యం పథకం కింద 2021-22లో రూ.3,596 కోట్లు కేటాయించగా ఈయేడు కేవలం రూ.1500కోట్లు కేటాయించి రైతులను ఆదుకుంటామని చెప్పటం వట్టి బూటకంగాక మరేమిటి?. బిజెపి అధికారంలోకి వచ్చిన తొలినాళ్ళలో ధరల స్థిరీకరణ నిధి కింద ఏడాదికి రూ.5 వేల కోట్లు కేటాయిస్తామని చెప్పింది. ఈ బడ్జెట్లో దాని ఊసే ఎత్తలేదు. రైతాంగం మీద ఎంత ప్రేమ ఉందో ఇది తెలియజేస్తోంది.

ప్రస్తుత సంవత్సరంలో రూ.16.50 లక్షల కోట్లు పంట రుణాలుగా ఇచ్చామని, రానున్న ఏడాదికి రూ. 18 లక్షల కోట్లను పంట రుణాలుగా ఇస్తామని, అందుకుగాను బడ్జెట్లో రూ.19 వేల కోట్లు వడ్డీ రాయితీ కింద కేటాయించామని చెబుతున్నారు. ఈ రుణాలు ఎవరికి ఇచ్చారు?. దేశం మొత్తంగా 50 శాతానికి పైగా కౌలు రైతులే పంటలు పండిస్తున్నారు. ఎన్.ఎస్.ఎస్ లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ మొత్తం రైతుల్లో 42.4 శాతం, ఒడిస్సా 39 శాతం, పశ్చిమ బెంగాల్ 29 శాతం, త్రిపురలో 28.5 శాతం, బీహార్లో 28 శాతం, హర్యానాలో 21 శాతం, పంజాబ్ 21శాతం, ఉత్తరప్రదేశ్లో 18 శాతం, తెలంగాణలో 18 శాతం కౌలు రైతులు సాగు చేస్తున్నారు. ఇంతకంటే ఎక్కువ మంది కౌలు రైతులు ఉంటారు. వీరికి కౌలు గుర్తింపు కార్డులు లేవని పంట రుణాలు ఇవ్వడం లేదు. దీనివల్ల కౌలు రైతులు.. ప్రైవేట్ వ్యాపారుల వద్ద అధిక వడ్డీలకు అప్పులు తెచ్చి పంటలు పండిస్తున్నారు. కనీసం సెంటు భూమి కూడా సాగు చేయని భూస్వాములు, భూ యజమానులే బ్యాంకుల నుండి 'వడ్డీ లేని అప్పులు' తెచ్చుకొని కౌలు రైతులకు నూటికి రెండు నుంచి ఐదు రూపాయలకు వడ్డీలకు ఇచ్చి కౌలు రైతుల ఆదాయాన్ని కాజేస్తున్నారు. అందుకు ఉదాహరణ మన రాష్ట్రమే. రాష్ట్రంలో ప్రస్తుత సంవత్సరంలో రూ.లక్ష కోట్లు పంట రుణాలు ఇస్తే కౌలు రైతులకు కేవలం రూ.350 కోట్లు ఇచ్చి చేతులు దులుపుకున్నారు.

పంటలను ప్రభుత్వం కొనుగోలు కేంద్రాల్లో అమ్ముకొనే అవకాశం లేక అయినకాడికి దళారులకు అమ్ముకొని తీవ్రంగా నష్టపోతున్నారు. ముఖ్యమంత్రి జగన్మోహనరెడ్డి తీసుకు వచ్చిన చట్టం కౌలు రైతులకు శాపంగా మారింది.

పెట్టుబడి సాయం కింద ఏడాదికి కేంద్ర ప్రభుత్వం ఒక్కొక్క రైతు కుటుంబానికి రూ.ఆరువేల చొప్పున సాయం చేస్తోంది. ఈ పెట్టుబడి సాయానికి రాష్ట్ర ప్రభుత్వం "రైతు భరోసా" పేరుతో మరో రూ.7,500 కలిపి రైతులకు ఇస్తోంది. నిరుడు రూ.67 వేల కోట్లు కేటాయించారు. కౌలు రైతులను గుర్తించి వారికి కూడా అందించాలని కోరుతుంటే.. మరో పక్క ఈ ఏడాది రూ.63 వేల కోట్లు కేటాయించి రూ.4,500 కోట్లు తగ్గించారు. వాస్తవంగా ఇది భూమి పథకం కాదు పంటల పెట్టుబడి పథకం. భూమిలో సాగు చేస్తున్న కౌలు రైతులకు ఈ సహాయం అందడం లేదు. వ్యవసాయాన్ని వదిలి ఇతర వృత్తులు చేపట్టిన వారికి పెట్టుబడి సాయం కింద నగదును ఇవ్వడం ఎంతవరకు సమంజసమని కౌలు రైతులు అవేదన చెందుతున్నారు

ఇదేగాక.. ప్రకృతి వైపరీత్యాల వల్ల ప్రతియేటా వేల కోట్ల రూపాయలు పంట నష్టం జరుగుతోంది. ఈ సంవత్సరం దేశవ్యాప్తంగా 8 రాష్ట్రాల్లో తామరపురుగు ఆశించిన మిరప పంట మొత్తం ఊడ్చుకు పెట్టుకు పోయింది. రైతాంగం భారీగా నష్టపోయింది. ఇందులో కౌలురైతులే ఎక్కువ దెబ్బ తిన్నారు. ఈ బడ్జెట్‌లో మిరప రైతుల పరిహారం గురించి కేటాయింపులే లేవు. మన రాష్ట్రంలో పంటల భీమా పథకం అమలు చేయడం లేదు. రాష్ట్ర ప్రభుత్వం.. కేంద్ర ప్రభుత్వం మీదకూ, కేంద్రం.. రాష్ట్ర ప్రభుత్వం మీదకూ నెట్టి మిరప రైతులకు పరిహారం ఇవ్వకుండా నట్టింట ముంచారు.

కొన్ని సందర్భాల్లో వచ్చిన ఇన్సూరెన్స్ పరిహారంకానీ ఇన్‌పుట్ సబ్సిడీకానీ కౌలు రైతులకు అందడం లేదు. ఈ రెండూ కూడా భూ యజమానుల బొక్కసంలోకి వెళుతున్నాయి. ఈ సంవత్సరం అన్ని పథకాలతోపాటు ఇన్సూరెన్స్ పథకానికి కోత తప్పలేదు. ప్రస్తుత సంవత్సరానికి రూ.16 వేల కోట్లు కేటాయించగా దానికి ప్రస్తుతం బడ్జెట్‌లో రూ.500 కోట్లు కోత పెట్టారు.

ఎరువుల ధరలు నిరుటి కంటే ఈయేడు 50 శాతం పెరిగాయి. పెరిగిన ధరలను తగ్గించడానికి కేంద్ర ప్రభుత్వం బడ్జెట్లో సబ్సిడీ పెంచకపోగా తగ్గించడం చాలా దారుణం. నిరుడు ఎరువుల సబ్సిడీ రూ.1.40 లక్షల కోట్లు కేటాయించగా వచ్చే ఏడాదికి 1.05 లక్షల కోట్లకు కుదించారు. అంటే 25 శాతం తగ్గిపోయింది. ఇప్పటికే ఎరువుల ధరలు పెరిగి సతమతమవుతున్న రైతాంగానికి ఈ బడ్జెట్లో కోత వల్ల వాటి ధరలు మరింత పెరిగి సాగు భారంగా మారనుంది. గత ఏడాది 50 కిలోల డిఏపి ఒక కట్ట రూ.1,250 ఉంటే నవంబరులో రూ.1900కి పెరిగింది. ఇది కాస్త రూ.2500 వరకు పెరిగే అవకాశం ఉంది. ఎరువుల ధరలు పెరిగితే వ్యవసాయ రంగంలో తీవ్రమైన పరిణామాలు సంభవిస్తాయి.

దీనితోపాటు అందరికి అవసరమైన ఆహార సబ్సిడీ పథకానికి నిధులను భారీగా తగ్గించారు. ఎంత తగ్గించారంటే రూ.65 వేల కోట్లు. 2021-2022 సంవత్సరం బడ్జెట్‌లో రూ.2,10,929 కోట్లు ఉంటే కొత్త బడ్జెట్ లో రూ.1,45,920 కోట్లే పెట్టారు. భారతదేశం ఆకలి సూచిలో 101వ దేశం.

ఈ సమయంలో బడ్జెట్‌లో నిధులు పెంచాల్సింది పోయి తగ్గించడం చాలా దారుణం. పోషకాహారం తగ్గి మరింత శిశు మరణాలు పెరుగుతాయి.ఆకలి పెరిగి మరణాలు సంభవిస్తాయి.

గ్రామీణ ప్రాంతానికి ఎంతో ఉపయోగపడుతున్న పథకం గ్రామీణ ఉపాధి హామీ పథకం. సంవత్సరానికి రెండు వందల రోజులు పని దినాలు, రోజుకు రూ.600 కూలి ఇవ్వాలని డిమాండ్ చేస్తుండగా వచ్చే సంవత్సరానికి రూ.98 వేల కోట్ల నుంచి రూ.73 వేల కోట్లుకు (25 వేల కోట్లు) అమాంతంగా కుదించారు.ఈ తగ్గింపు గ్రామీణ ప్రజలపై తీవ్రమైన ప్రభావం చూపుతుంది.

రైతాంగ ఆదాయం 2022 నాటికి రెట్టింపు చేస్తామని 2016లో ప్రధాన మంత్రి మోడీ హామీ ఇచ్చారు. అది శుష్కప్రియంగా మారిపోయి శూన్య హస్తం చూపుతోంది. అయితే సాగు ఖర్చులు పెరిగాయి. విత్తనాల ధరలు 30 శాతం పెరిగాయి. ఎరువుల ధరలు 50 శాతం, పురుగు మందుల ధరలు 40 శాతం, వ్యవసాయ ఉపకరణాల ధరల 100 శాతం, పెట్రోల్, డీజిల్ ధరలు పెరిగాయి. ట్రాక్టర్ల అద్దెలు మరో 50 శాతం పెరిగాయి ఈ విధంగా పెట్టుబడికి కనీసం ఖర్చులు కూడా రావడం లేదు. చేసిన అప్పులు తీర్చలేక ప్రతి సంవత్సరం 12,600 రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. వీరిలో 90 శాతం మంది కౌలు రైతులే. వ్యవసాయ సంక్షోభం నుంచి కాపాడే విధంగా బడ్జెట్ నిధులు పెంచాలి. రైతాంగానికి భరోసా ఇవ్వాలి. కౌలు రైతులను గుర్తించి వారి సంక్షేమానికి, వారి అభివృద్ధికి నిధులు ఖర్చు చేయకపోతే రాబోయే కాలంలో వ్యవసాయమే ఉండదు. ఈరోజు వ్యవసాయం నిలబడి ఉందంటే కౌలు రైతులు వల్లనే.

కార్పొరేట్ సంస్థలకు ఉపయోగపడే హైటెక్ సాగు పద్ధతులు, అచరణలో సాధ్యంకాని పెట్టుబడిలేని ప్రకృతి వ్యవసాయం, ఆధునిక పద్ధతిలో భారీ యంత్రాలు, డ్రోన్‌లతో సేద్యం వంటి వాటికి బడ్జెట్లో పుష్కలంగా నిధులు కేటాయించారు. అంటే దేశంలో వ్యవసాయం రంగంపై ఆధారపడే 65 శాతం రైతాంగానికి ఇది ఏ మాత్రం వుపయోగపడదు. వీటిని నిర్వహించే కార్పొరేట్ సంస్థలకు లాభాలుంటాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే కేంద్ర బడ్జెట్ నేల విడిచి సాము చేసినట్లుంది. కేంద్ర ప్రభుత్వం వ్యవసాయ రంగానికి భారీగా నిధులు పెంచటంతోపాటు కౌలు రైతులను గుర్తించి వ్యవసాయ రాయితీ పథకాలన్నీ కౌలు రైతులకు వర్తింప చేసే విధంగా చర్యలు చేపట్టాల్సిన ఆవశ్యకత కనిపిస్తుంది. లేకపోతే దేశమే ప్రమాదకరమైన పరిస్థితి ఎదుర్కోవలసి వస్తుంది.



# 28న గ్రామీణ బంద్‌ను జయప్రదం చేయాలి

## 28, 29 సార్వత్రిక సమ్మెలో పాల్గొనాలి

కనీస మద్దతు ధరకు చట్ట బద్ధత కల్పించాలని కోరుతూ, కేంద్ర ప్రభుత్వ రైతు వ్యతిరేక విధానాలను వ్యతిరేకిస్తూ మార్చి 28న దేశవ్యాప్తంగా గ్రామీణ బంద్ నిర్వహించాలని సంయుక్త కిసాన్ మోర్చా (ఎస్‌కెఎం) పిలుపునిచ్చింది. ఆ పిలుపు మేరకు రాష్ట్రంలోనూ గ్రామీణ బంద్‌ను విజయవంతం చేయాలని ఎపి రైతు సంఘం, ఎపి కౌలు రైతు సంఘాలు పిలుపునిచ్చాయి. అలాగే మార్చి 28, 29 తేదీల్లో జరుగుతున్న దేశవ్యాప్త సమ్మెను జయప్రదం చేయాలని కోరుతూ పై రెండు రైతు సంఘాలతోపాటు సిఐటియు, వ్యవసాయ కార్మిక సంఘాలు కూడా రైతాంగాన్ని, కార్మికులను కోరాయి. ఈ మేరకు మార్చి 1న పై నాలుగు సంఘాల సమన్వయ కమిటీల ఉమ్మడి సమావేశం నిర్ణయించింది. సమావేశానికి ఎపి రైతు సంఘ ఉపాధ్యక్షులు వి.కృష్ణయ్య అధ్యక్షత వహించారు. ఉమ్మడి సమావేశ నిర్ణయాలను ఆయా సంఘాల ప్రధాన కార్యదర్శులు ప్రకటనగా విడుదల చేశారు. 'కార్మిక, ప్రజావ్యతిరేక వినాశకర విధానాలతో మొండిగా ముందుకు సాగుతున్న మోడీ ప్రభుత్వాన్ని నిలువరించేందుకు మార్చి 28, 29 తేదీల్లో దేశవ్యాప్త సమ్మెకు కేంద్ర కార్మిక సంఘాల ఐక్యవేదిక పిలుపు ఇచ్చిందని, దేశ సంపద సృష్టికర్తలైన రైతులు, కార్మికులు నిరంతరం జరిపే పోరాటాల కొనసాగింపుగానే ఈ సార్వత్రిక పిలుపు అని ఆ ప్రకటనలో పేర్కొన్నారు. దేశ సంపదను వేలం వేసేందుకు, స్వదేశీ విదేశీ బడా పెట్టుబడిదార్లకు (కార్పొరేట్లకు) కారుచౌకగా విక్రయించేందుకు బరితెగించిన నిరంకుశ పాలకులను నిలువరించడానికి, దేశానికి వినాశకరంగా పరిణమించిన విధానాలను తిప్పికొట్టేందుకు ఈ సమ్మెలో రాష్ట్రంలోని కార్మికులు, కర్షకులు పాల్గొనాలని ఆ ప్రకటనలో పేర్కొన్నారు. ఆర్‌ఎస్‌ఎస్ కనుసన్నల్లో బిజెపి ప్రభుత్వం తెచ్చిన ప్రగతి నిరోధక, మోసపూరిత వ్యవసాయ చట్టాలను తిప్పికొట్టేందుకు, ప్రజావ్యతిరేక కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి మెడలు వంచేందుకు దేశవ్యాప్తంగా రైతులు ఏడాదికి పైగా వీరోచిత పోరాటం చేశారని, కార్మికవర్గం నిరంతర సంఘీభావ కార్యక్రమాలతో రైతుల పోరాటానికి మద్దతు ఇచ్చిందని గుర్తుచేశారు. ఈ పోరాట స్ఫూర్తితో కేంద్ర కార్మిక సంఘాలు, స్వతంత్ర సంఘాల ఐక్యవేదిక "ప్రజలను కాపాడుకుందాం. దేశాన్ని రక్షించుకుందాం" అని పిలుపునిచ్చిందని పేర్కొన్నారు. ప్రకటనను సిఐటియు, ఎపి రైతు సంఘం, వ్యవసాయ కార్మిక సంఘం, ఎపి కౌలు సంఘం పక్షాన ఎం.ఎ.గఫూర్, ఎం.సూర్యనారాయణ, వి.వెంకటేశ్వర్లు, పి.జమలయ్య విడుదల చేశారు. ❋

# మిర్చి రైతులను ఆదుకోవాలి

- కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నష్టపరిహారమివ్వాలి

తామర తెగులు వల్ల తీవ్రంగా నష్టపోయిన మిర్చి రైతులను రాష్ట్ర ప్రభుత్వం వెంటనే ఆదుకోవాలని సిపిఎం పొలిట్ బ్యూరో సభ్యులు బి.వి.రాఘవులు డిమాండ్ చేశారు. మిర్చి, పత్తి రైతులను ఆదుకోవాలని కోరుతూ గుంటూరు జిల్లా దాచేపల్లిలో గత ఎనిమిది రోజులుగా నిర్వహిస్తున్న నిరాహార దీక్షా శిబిరాన్ని ఫిబ్రవరి 23 సాయంత్రం ఆయన సందర్శించారు. రైతులకు నిమ్మరసం ఇచ్చి దీక్షను విరమింపజేశారు. రైతులను సమీకరించి, పోరాటాన్ని మరో దిశగా నిర్వహించాలని ఈ సందర్భంగా వారికి ఆయన సూచించారు. రామాపురం, గామాలపాడులో తామర తెగులుతో దెబ్బతిన్న మిర్చి పైరును పరిశీలించారు. మిర్చి రైతులను ఆదుకోవాలని కోరుతూ దాచేపల్లి పట్టణంలో జరిగిన ర్యాలీలో పాల్గొన్నారు. అనంతరం దాచేపల్లిలోని మందపాటి నాగిరెడ్డి కల్యాణ మండపంలో జరిగిన బహిరంగ సభలో రాఘవులు మాట్లాడుతూ మిర్చి టాస్క్‌ఫోర్స్ ఛైర్మన్‌గా ఉన్న బిజెపి రాజ్యసభ సభ్యులు జివిఎల్.నరసింహారావు గుంటూరు జిల్లాలో అత్యధికంగా నష్టపోయిన మిర్చి రైతులను ఏ మేరకు ఆదుకున్నారో చెప్పాలని డిమాండ్ చేశారు. పిఎం కేర్స్ ఫండ్స్ నుంచి కేంద్ర ప్రభుత్వం మిర్చి రైతులకు నష్టపరిహారం ఎందుకు ఇవ్వకూడదని ప్రశ్నించారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి మిర్చి రైతులను ఆదుకోవాలని డిమాండ్ చేశారు. మిర్చి రైతులకు సహాయం



అందించడం కోసం నిధులు తెచ్చుకోవడానికి అవసరమైతే కేంద్రంతో రాష్ట్ర ప్రభుత్వం పోరాడాలని సూచించారు. గుంటూరు జిల్లాల్లో 2.55 లక్షల ఎకరాల్లో మిర్చి సాగు చేస్తే, తామర తెగులు వల్ల 90 శాతం పంట తుడిచిపెట్టుకొని పోయిందన్నారు. రాష్ట్ర ప్రభుత్వం ఉన్నత స్థాయి కమిటీ ఏర్పాటు చేసి రైతులకు నష్టపరిహారం, బీమా వెంటనే అందజేయాలని డిమాండ్ చేశారు. కోలా నవజ్యోత్ అధ్యక్షత జరిగిన సభలో ఎపి కౌలు రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.రాధాకృష్ణ, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి జమలయ్య, పౌరహక్కుల సంఘం రాష్ట్ర కార్యదర్శి చిలకా చంద్రశేఖర్, నల్లమల రైతు సంఘం కార్యదర్శి డాక్టరు కొల్లా రాజమోహన్, ఎరువాక సంఘం జిల్లా నాయకులు కోటేశ్వరరావు ప్రసంగించారు. ❋

# పంట నష్టం అపారం... సాయం అత్యల్పం...






**పి. జమలయ్య**

రాష్ట్ర ప్రధాన కార్యదర్శి,

ఆంధ్రప్రదేశ్ కౌలురైతుల సంఘం.


"కౌలు రైతులను గత సర్కారు ఏరోజూ గుర్తుంచుకో లేదు. కానీ అర్హులు ఎవరూ మిగిలిపోకుండా ఈ క్రాఫ్ బుకింగ్ డేటాతో శాస్త్రీయంగా ఆర్.బి.కె స్థాయిలోనే అంచనా వేసే విధానాన్ని ప్రవేశపెట్టాం. పారదర్శకతకు పెద్ద పీట వేస్తూ గ్రామ సచివాలయం లోనే లబ్ధిదారుల జాబితాను ప్రదర్శిస్తున్నాం. ఏ సీజన్లో జరిగిన నష్టం పరిహారం ఆ సీజన్లోనే రైతుల ఖాతాలో జమ చేస్తున్నాం" అని రాష్ట్ర ప్రభుత్వం చెబుతోంది. కౌలు రైతులకు సైతం ఇ-క్రాఫ్ బుకింగ్ డేటా ఆధారంగా ఇన్‌ఫుట్ సబ్సిడీ (పెట్టుబడి రాయితీ)ని అందజేస్తున్నామని గొప్పలు చెప్పుకోవటం హాస్యాస్పదంగా ఉంది. 2021 సంవత్సరం నవంబరులో తుపాన్లు, భారీ వర్షాలు, వరదల వల్ల నష్టపోయిన రైతులకు మూడు నెలల తిరగకముందే ఇన్‌ఫుట్ సబ్సిడీతోపాటు నేలకోత, ఇసుక మేట వల్ల నష్టపోయిన వారికి పరిహారంగా రూ. 542 కోట్లను రైతు ఖాతాలో జమ చేసినట్లు ప్రభుత్వం చెబుతోంది. దీంతోపాటు వైఎస్ఆర్ సేవా పథకం కింద మరో రూ. 29 కోట్లు కూడా ఇస్తున్నట్లుగా రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ప్రస్తుతం ప్రకటించిన ఇన్‌ఫుట్ సబ్సిడీ చాలా తక్కువగా ఉన్నది. జరిగిన నష్టం, వచ్చిన ఇన్‌ఫుట్ సబ్సిడీ చూస్తే బిక్షమేసినట్లుగా ఉంది. తుపానులు, అధిక వర్షాలు, వరదల వల్ల రాష్ట్రంలో లక్షలాది ఎకరాల పంటలు దెబ్బతిన్నాయి.

రాష్ట్రం మొత్తంగా ఖరీఫ్‌లో 90 లక్షల ఎకరాల్లో పంటలు వేశారు. ఇందులో వరి, పత్తి, మిరప, వేరుశనగ, కంది సాగు విస్తీర్ణం సుమారు 80 లక్షల ఎకరాలు. తుపానులు, అధిక వర్షాలు, వరదలు ముప్పు కారణంగా దెబ్బతిన్న విస్తీర్ణం 52 లక్షల ఎకరాలని అంచనా. మొత్తం రూ. 16 వేల కోట్లను పంటల సాగు కోసం రైతాంగం పెట్టుబడి పెట్టి నష్టపోయింది. సుమారు రూ. 20 వేల కోట్లు ఉత్పత్తి విలువను కోల్పోయారు. ఇందులో ఎక్కువగా నష్టపోయింది కౌలు రైతులే. ఎందుకంటే వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పులలో భాగంగా కౌలురైతులే సాగు భూమిలో 70 శాతం సేద్యం చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం ప్రకృతి విపత్తుల సహాయం కింద కేవలం రూ. 542 కోట్లు ఇచ్చి చేతులు దులుపుకుంది. ఈ పరిహారం విడుదల చేసిన దానిని బట్టి చూస్తే 'పంచ పాండవులు మంచం కోళ్ళు' వలె మూడు రాసి, రెండింటిని చూపి, ఒకటి చెప్పినట్లుగా ఉంది.

- వరి పంటైతే రైతులకు కన్నీరే మిగిల్చింది. వరిపంట సాగు విస్తీర్ణం 39 లక్షలు ఎకరాలు. పంట పూర్తిగాను, పాక్షికంగా దెబ్బతిన్నది. సుమారు రూ. 2,250 కోట్లు పెట్టుబడి పెట్టి నష్టపోయారు.
- మరో ముఖ్యమైన వాణిజ్య పంట పత్తి. రాష్ట్రంలో 13 లక్షల ఎకరాల్లో సాగు చేశారు. సుమారుగా 80 శాతం దెబ్బతిని పోయింది. సుమారు పెట్టుబడి నష్టం రూ. 1,662కోట్లు పైచిలుకు నష్టం జరిగింది.
- ధాన్యం తరువాత అత్యధికంగా 6 లక్షల 13 వేల ఎకరాల్లో కంది సాగు చేస్తే అధిక వర్షాలతో అది 60 శాతం పైనే దెబ్బతిన్నది. పంట చేతికి వచ్చే సమయంలో అధిక వర్షాలు శాపంగా మారాయి.



- వాణిజ్య పంటల్లో మిరప పంట ప్రధాన మైనది. తామర పురుగు ఆశించి 5 లక్షల 13 వేల ఎకరాల్లో పంటను తినేసింది. ఏమీ మిగలల్లేదు. ఒకవైపు బొబ్బర, మరోవైపు తామరపురుగు తదితర వైరస్‌ల వల్ల ఊడ్చు పెట్టుకుపోయింది. రూ.4,360 కోట్లను పెట్టుబడి పెట్టి దెబ్బతిన్నారు. ఇందులో ఎక్కువ మంది కౌలు రైతులే నష్ట పోయారు. పైసా కూడా రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేయలేదు. ఇంతకన్న మరో ఘోరం మరొకటి లేదు.
- దీంతోపాటు వేరుశెనగ పంటను 16 లక్షల పైచిలుకు ఎకరాల్లో సాగు చేశారు. దెబ్బతిన్న విస్తీర్ణం సుమారు 70 శాతం ఉందని అంచనా.రూ.3వేల కోట్ల పంట పెట్టుబడి నష్టం జరిగింది. ఈ విధంగా ఏ పంట చూసినా నష్టపోయిన పరిస్థితే కనపడుతోంది. పంటలు నష్టపోయిన రైతాంగాన్ని ఆదుకోవడంలో రాష్ట్ర ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది
- కృష్ణాజిల్లాలో జగ్గయ్యపేట మండలం తక్కెళ్ళపాడు, నందిగామ మండలం గోళ్ళమూడి, చందర్లపాడు, గుంటూరు జిల్లాలో ఫిరంగిపురం, మేడికొండూరు మండలం సిరిపురం, సత్తెనపల్లి మండలం రెంటపాళ్ళ, ప్రకాశం జిల్లాలో ఈ మూడు నెలల కాలంలో పది మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా మూడు నెలల్లో అనేకమంది రైతులు ఆత్మహత్యలు చేసుకునే స్థితికి నెట్టబడ్డారు. వైఎస్‌ఆర్‌సిపి అధికారం చేపట్టిన రెండున్నర సంవత్సరాల కాలంలో కౌలు రైతులకు అన్యాయం జరిగింది. జరుగుతూనే ఉంది .

రాష్ట్ర విభజన సంవత్సరం (2014) నుండి కౌలు రైతులకు పెట్టుబడి రాయితీ అందడం లేదు. ఈ ఏడు సంవత్సరాల్లో రూ. 19,166 కోట్లిస్తే కౌలు రైతులకు ఇచ్చింది నామమాత్రమే.

వడ్డీ రాయితీ పథకం కింద 66 లక్షల మందికి రూ.1,218 కోట్లిస్తే ఇందులో ఒక్క రూపాయి కూడా కౌలు రైతులకు దక్కలేదు. ఉచిత పంటల బీమా పథకం ఇప్పటివరకు మూడు లక్షల మంది రైతులకు రూ.3,788 కోట్లిస్తే కౌలు రైతులకు చిల్లిగవ్వ కూడా అందలేదు. ధాన్యం కొనుగోలు కోసం ఖర్చు చేసే నిధుల వల్ల కౌలు రైతులకు చేకూరే ప్రయోజనం శూన్యం. కారణం వైఎస్‌ఆర్‌సిపి అధికారంలోకి వచ్చిన తొలినాళ్లలో గతంలో ఉన్న "పంట సాగు కౌలు రైతుల చట్టం రద్దుచేసి నూతన కౌలు రైతుల చట్టాన్ని రాష్ట్ర ప్రభుత్వం తీసుకువచ్చింది. యజమాని లిఖిత పూర్వక ఒప్పందపత్రం రాసిస్తేనే కౌలు రైతులకు కౌలు గుర్తింపు కార్డు జారీ చేయాలని గ్రామ సచివాలయం అధికారాలకు ఆదేశాలు జారీ చేసింది. గ్రామ సచివాలయంలో పనిచేస్తున్న సిబ్బంది మాట గ్రామాల్లో భూ యజమానులు, భూస్వాములు ఎవ్వరూ లెక్క చేయడంలేదు. పైగా సహజ సిద్ధంగా ఉండే భూ యజమాని దోపిడీ స్వభావం కౌలు ఒప్పందం పత్రం రాసి ఇవ్వడానికి మనస్సు అంగీకరించదు. అందుచేత "పంట సాగుదారుల హక్కుల కార్డులు (సిసిఆర్ సి) పొంద లేకపోయారు. కార్డులు లేకపోతే పెట్టుబడి సాయం గాని, ఇన్‌పుట్ సబ్సిడీగాని, రైతు భరోసాగాని, ఆర్‌బికె కేంద్రాలలో పంటలు అమ్ముకోని అవకాశం కోల్పోయారు. జగన్ ప్రభుత్వం తీసుకు వచ్చిన కౌలు చట్టం కౌలు రైతులకు శాపంగా మారింది. ఎన్నడూలేని విధంగా దేశంలోనే కౌలు రైతులకు పలురకాల కౌలు రైతులకు సంక్షేమ పథకాలు అమలు చేస్తున్నామని చెప్పడం ఒక బూటకం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేస్తున్న రాయితీ ఫథకాలన్నీ సెంటు భూమి కూడా సాగు చేయని భూస్వాములు కాజేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వాల వైపు నుంచి ఎటువంటి తోడ్పాటు అందకపోయిన ఆధిక వడ్డీలకు అప్పులు తెచ్చి పంటలు పండిస్తూ దేశానికి తిండి పెట్టే రైతులకు ఆదరణ కరువైంది. కనీసం పండిన పంటలకు మద్దతు ధరలు దక్కడం లేదు. కృష్ణాజిల్లా చందర్లపాడు మండలం లోనూ, జగ్గయ్యపేట ప్రాంతంలోనూ, గుంటూరు జిల్లా మేడికొండూరు, కోసూరులోనేగాక, ప్రకాశం జిల్లాలో పది మంది రైతులు, రాయలసీమ జిల్లాలో ప్రతిరోజూ ఏదో ఒక మూల అన్నదాతలు బలవన్మరణాలు చెందుతూనే ఉన్నారు. ఆత్మహత్యలు పరిశీలిస్తే కర్షకుల కష్టాలు సంస్కరణల కాలంలో మరింత పెరుగుతున్నాయి. మూడో దఫా కోవిడ్ సమయంలో కూడా ఇంట్లో కూర్చోకుండా మాస్కు పెట్టుకొని పంటలు పండించి దేశానికి తిండి పెట్టి రక్షించిన రైతులను ఆదుకోవడంలో ఎంత నిర్లక్ష్యంతో ఉందో రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసిన ఇన్‌పుట్ సబ్సిడీని పరిశీలిస్తే అర్థం అవుతుంది. 2007లో అప్పటి కేంద్ర ప్రభుత్వం పంజాబ్ ముఖ్యమంత్రి భూపేంద్ర సింగ్ హూడా నాయకత్వంలో ప్రకృతి వైపరీత్యాలకు సంబంధించి ఒక కమిషన్ వేశారు. చీడలు, పీడలు, అతివృష్టి, అనావృష్టి రకరకాల ప్రకృతి వైపరీత్యాల వల్ల నష్టపోయినప్పుడు ఒక హెక్టరుకు రూ. 25 వేలు పరిహారం ఇవ్వాలని సిఫార్సు చేసింది. అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం పట్టించుకోలేదు. ఇప్పటి బిజెపి సర్కారుకు బుద్ధి లేదు.

ఇప్పటికైనా రాష్ట్ర ప్రభుత్వం ఆహార పంటలకు ఎకరానికి రూ.25 వేలు, వాణిజ్య పంటలకు రూ. 50 వేలు, అపరాలకు రూ.30వేలు చొప్పున పెట్టుబడి సాయం ఇవ్వాల్సిన అవసరం ఉన్నది. దీంతోపాటు పంటల బీమా పథకం కింద కూడా పరిహారం ఇచ్చేందుకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు బాధ్యత తీసుకోవాలి. లేకపోతే భవిష్యత్తులో వ్యవసాయ మనుగడకు ప్రమాదం ఏర్పడుతుంది.






ప్రొఫెసర్ ఎన్. వేణుగోపాలరావు
సెల్ : 9490098905

**1. ఆధునిక వ్యవసాయం :**

మొదటి పంచవర్ష ప్రణాళిక సందర్భంగా పంటల దిగుబళ్లపై, ఆహార రంగంపై నిపుణుల ద్వారా జరిపిన సర్వేలు, వేసిన అంచనాలు, వాస్తవికతను తెలిపాయి. ఆ దశలో 86 మిలియన్ హెకార్ల నుండి 54 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాలు, 13.2. మిలియన్ హెక్టార్ల నుండి 6.2 మిలియన్ టన్నుల నూనె గింజలు పొందగలిగాం.

| మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభానికి వ్యవసాయరంగ పరిస్థితి | | |
|---|---|---|
| | విస్తీర్ణం (మి.హె.) | దిగుబడి (మి.ట.) |
| ధాన్యాలు | 77.1 | 48.64 |
| అపరాలు | 9.3 | 5.3 |
| నూనె గింజలు | 12.2 | 6.2 |
| నారలు | 0.28 | 5.1 |
| చెరకు | 1.6 | 3.66 |
| పొగాకు | 0.3 | 0.26 |
| మిరప | 0.6 | 0.41 |
| పండ్లు | 0.5 | 13.62 |
| కూరగాయలు | 1.9 | 9.75 |
| దుంపలు | 0.4 | 3.05 |

వలస పాలకుల విధానాలకు కొనసాగింపుగా స్వతంత్ర దేశంలో వ్యవసాయానికి తగిన నీటి వనరులను పెంచే ప్రయత్నాలు కొన్ని ప్రాంతాల్లో జరిగాయి. అమెరికా, సోవియట్ రష్యా ప్రభావంతో తాత్కాలిక ప్రయోజనాలను పరిశీలించి వ్యవసాయంలో కొన్ని మార్పులను చేయడం జరిగింది. అయినా 1950 -51 నాటికి కేవలం 19.6 మిలియన్ హెక్టార్లలో మాత్రమే నీటి పారుదల సౌకర్యమున్న భూమి ఉండటం గుర్తించాల్సిన విషయం. అందుకే పంచవర్ష ప్రణాళికల ద్వారా వ్యవసాయ పారిశ్రామికాభివృద్ధికి ప్రభుత్వాలు ప్రయత్నం చేశాయి. పెట్టుబడులు పెంచే ప్రయత్నాలు చేశారు. ఫలితంగా రెండు దశాబ్దాల కాలంలో వ్యవసాయ రంగం కొన్ని మార్పులకు గురవుతూ రావడాన్ని మనం గమనించవచ్చు

| వ్యవసాయ పెట్టుబళ్ల వృద్ధి స్థాయి (1950 - 70) | | | | | |
|---|---|---|---|---|---|
| | స్థూల దశ | పెరుగుదల స్థాయి (దామాషా) | | | |
| | 1950 | 1956 | 1961 | 1966 | 1971 |
| భూ విస్తీర్ణం | 100 | 106 | 111 | 115 | 120 |
| సాగునీరు | 100 | 111 | 122 | 130 | 145 |
| ఎరువులు | 100 | - | - | 248 | 741 |
| విత్తనాలు | 100 | - | - | - | 166 |

**హరిత విప్లవ పూర్వ దశ**

మొదటి పంచవర్ష ప్రణాళిక (1951-55) ప్రారంభంలోనే "అధిక ఆహారోత్పత్తి" (గ్రో మోర్ ఫుడ్) పేరుతో నిపుణుల సంఘాన్ని నియమించడం జరిగింది. వారి సిఫార్సుల అమలు క్రమంలో కొన్ని మార్పులు చేయబడటం, తద్వారా సాగు చేసిన 117.36 మిలియన్ హెక్టార్ల భూమి నుండి 65.8 మిలియన్ టన్నుల తిండిగింజలను పొందగలిగాం. అంటే సగటున తలకొకటి రోజుకు 595 గ్రాముల

ఆహారం లభించే స్థితి వచ్చింది. అయినా మొదటి పంచవర్ష ప్రణాళికను సమీక్షిస్తే అర్థమయ్యేది, వ్యవసాయాభివృద్ధి సరిపోలేదని, సగటున సంవత్సరానికి 3 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాలు తక్కువ పండటం దీన్ని సూచిస్తూనే ఉంది. 1951లో 4.8 మిలియన్ టన్నుల తిండి గింజలను దిగుమతి చేసుకుంటే 1955-56లో 0.7 మిలియన్ టన్నుల గింజలను దిగుమతి చేసుకోవాల్సి వచ్చింది. అందుకే 1957లో "తిండి గింజల సమీక్షా సంఘం"ను ప్రభుత్వం ఏర్పరిచింది. వారి సిఫార్సుల ప్రకారం వ్యవసాయంలో కొన్ని సంస్కరణలు చేశారు. తద్వారా విస్తరణ కార్యక్రమాలకు, పరపతి సౌకర్యాలకు, సహకార సంఘాల రూపకల్పనకు బీజాలు పడ్డాయి.

**సాగు విస్తీర్ణం, ఉత్పత్తుల పెరుగుదల స్థాయి (1950-70)**

| | మొదటి దశ | పెరుగుదల స్థాయి | | |
|---|---|---|---|---|
| | (1950-55) | 1956-60 | 1961-66 | 1966-70 |
| సాగు విస్తీర్ణం (మి.హె.) | 117.36 | 1.07 | 0.40 | 0.75 |
| పంటల సాంద్రత (మి.హె.) | 120.12 | 0.43 | 0.25 | 0.34 |
| పంటల ఉత్పత్తి (మి.ట.) | 65.8 | 3.54 | 2.52 | 3.01 |
| ఉత్పాదకత (కిలోలు/హె) | 79.5 | 1.56 | 1.50 | 1.55 |
| తలసరి లభ్యత (గ్రాము/రోజుకు) | 595 | - | - | - |

రెండో పంచవర్ష ప్రణాళికా దశలో కూడా సగటున సంవత్సరానికి 6.8 మిలియన్ టన్నుల తిండిగింజల లోటు పడటం, 1.4 నుండి 3.4 మిలియన్ టన్నుల వరకూ దిగుమతులు చేసుకోవడం జరిగింది. దరిమిలా 1959 "ఫోర్డ్ ఫౌండేషన్ నిపుణుల" సూచన్ల ప్రకారం, నీటి పారుదల వసతులు పెంచడం, రసాయన ఎరువులకు నిధులను కేటాయించడం, కౌలు రైతుల రక్షణ కోసం విధానాలను రూపొందించడం, ధరలను స్థిరీకరించడం, పరపతి, రవాణా, మార్కెటింగ్ సౌకర్యాలు పెంచడం జరిగింది. అమెరికా దేశ "లాండ్ గ్రాంట్ కాలేజెస్" తరహాలో దేశంలో వ్యవసాయ విశ్వవిద్యాలయాలను ఏర్పరిచి నైపుణ్యాన్నిచ్చే విద్యకు, విస్తరణకు, పరిశోధనకు అవకాశాలు పెంచడం జరిగింది. అయినా 3వ పంచవర్ష ప్రణాళిక (1961-66) విఫలమైపోయింది. ఆ కాలంలో కూడా దాదాపు సాలుకు 4.5 మిలియన్ టన్నుల నుండి 10.3 మిలియన్ టన్నుల తిండి గింజలను దిగుమతి చేసుకోవాల్సిన స్థితి నెలకొంది. దీనికి కారణం జనాభా పెరుగుదల (367 మిలియన్స్ నుండి 511 మిలియన్స్), చైనా, పాకిస్తాన్ వంటి పొరుగు దేశాలతో ఘర్షణల వల్ల వ్యవసాయాభివృద్ధికి తగినన్ని నిధులు సమకూర్చలేక పోవడం కూడా కావచ్చు.

**హరిత విప్లవ పూర్వ దశలో తిండి గింజల ఉత్పత్తి, లోటు వివరాలు**

| ప్రణాళికా కాలం | సగటు ఉత్పత్తి (మి.ట.) | సగటు లోటు (మి.ట.) |
|---|---|---|
| 1951 - 55 | 61.5 (65 మి.ట.లక్ష్యం) | 3.1 |
| 1956 - 60 | 74.7 (80 మి.ట.లక్ష్యం) | 5.1 |
| 1961 - 66 | 82.7 (100 మి.ట.లక్ష్యం) | 13.5 |
| 1970 - 71 | 107.8. (120 మి.ట.లక్ష్యం) | 12.2 |

# మిర్చి రైతులను ఆదుకోకుంటే 'చలో సెక్రటరియేట్'

**- అఖిలపక్ష రైతు సంఘాల నిర్ణయం**



తామర తెగులుతో నష్టపోయిన మిర్చి రైతులకు ఎకరాకు రూ.లక్ష నష్టపరిహారం రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించకపోతే అసెంబ్లీ సమావేశాల సందర్భంగా మార్చిలో 'చలో సెక్రటరియేట్' నిర్వహిస్తామని అఖిలపక్ష రైతు సంఘాలు హెచ్చరించాయి. రైతు సంఘాల సమన్వయ కమిటీ రాష్ట్ర సమావేశం గుంటూరులోని పిఎల్‌రావు భవన్‌లో ఎపి రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.కేశవరావు అధ్యక్షతన ఫిబ్రవరి 23న జరిగింది. ఈ సమావేశంలో 17 రైతు సంఘాలకు చెందిన రాష్ట్ర నాయకులు పాల్గొని 'చలో సెక్రటరియేట్' సన్నాహక కార్యాచరణపై చర్చించారు. మార్చి 3న అర్‌బికెల్లో వినతిపత్రాలు ఇవ్వాలని, మిర్చి పండించే అన్ని జిల్లాల నుంచి రైతుల్ని పెద్దసంఖ్యలో 'చలో సెక్రటరియేట్'కి సమీకరించాలని సమావేశంలో నిర్ణయించారు. రాష్ట్రంలో ఈ ఏడాది మిర్చి రైతులు పంటను కోల్పోయి దిక్కుతోచని స్థితిలో ఉన్నారని, తక్షణమే ప్రభుత్వం వారిని ఆదుకోవాలని డిమాండ్ చేశారు. రాష్ట్రంలో 5.25 లక్షల ఎకరాల్లోని మిర్చి పంట తామర తెగులుతో పూర్తిగా దెబ్బతిందన్నారు. ఇప్పటికే రెండు లక్షల ఎకరాల్లో పంట తీసేశారని, మిగతా పంటలోనూ ఎకరానికి రెండు, మూడు క్వింటాళ్లకు మించి దిగుబడి రావట్లేదని తెలిపారు. రాష్ట్ర ప్రభుత్వం బీమా ప్రీమియం చెల్లించలేదని, పంటలో తెగులును గుర్తించిన తర్వాత రైతులు పెట్టుబడి పెట్టకుండా అవగాహన కల్పించడంలో విఫలమైందని అన్నారు. దీంతో పంటను కాపాడుకునేందుకు రైతులు మరింత పెట్టుబడి పెట్టారని తెలిపారు. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వమే బాధ్యత వహించి ఎకరాకు రూ.లక్ష నష్టపరిహారం ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఈ సమావేశంలో ఎపి సాగునీటి వినియోగదారుల సంఘాల సమాఖ్య అధ్యక్షులు ఆళ్ల వెంకటగోపాలకృష్ణారావు, రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కెవివి ప్రసాద్, ఎపి రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎం.సూర్యనారాయణ, ఎఐకెఎంఎస్ రాష్ట్ర సహాయ కార్యదర్శి ఎన్.బ్రహ్మయ్య, ఎపి రైతు కూలీ సంఘం ఉల్లిగడ్డల నాగేశ్వరరావు, తెలుగు రైతు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కుర్రా నరేంద్ర, సామాజిక వన రైతు సంఘం నాయకులు వి.హనుమారెడ్డి, ఎఐకెఎఫ్ చింతలపూడి పవన్‌కుమార్, ఎపి కౌలురైతు సంఘం రాష్ట్ర నాయకులు బైరగాని శ్రీనివాసరావు తదితరులు పాల్గొన్నారు. ✳



# విపత్తు బాధిత రైతులకు పరిహారం పిసరంత



కె.ఎస్.వి. ప్రసాద్
94900 99019

విపత్తులతో పంటలు నష్టపోయిన రైతులకు ప్రభుత్వం ఇచ్చే పరిహారం ఏ మూలకూ చాలట్లేదు. రాష్ట్ర విభజన అనంతరం ఎప్పుడో ఏడేళ్లనాడు హుదూద్ తుపానప్పుడు ఖరారు చేసిన మొత్తాన్నే (స్కేల్ ఆఫ్ అసిస్టెన్స్) ఇప్పుడూ అమలు చేస్తున్నారు. 14వ ఆర్థిక సంఘం సిఫారసుల మేరకు, నిపుణుల అధ్యయనం తర్వాత 2015-20 ఐదేళ్ల కాలానికి కేంద్రం 2015లో స్కేల్ ఆఫ్ అసిస్టెన్స్‌ను నిర్ణయించగా, ఎపి సర్కారు అప్పటికే అంతకంటే ఎక్కువ ఇస్తున్నందున, కేంద్రం సూచనలు స్వీకరిస్తూనే, 2014లో హుదూద్ నాడు నిర్ణయించిన సాయాన్ని అప్పటి టిడిపి ప్రభుత్వం కొనసాగించింది. కాగా తిత్లీ తుపాను సమయంలో వాస్తవంగా జరిగిన నష్టాలను రైతులకు సహాయంగా అందించట్లేదని అప్పుడు ప్రతిపక్షంలో ఉన్న వైసిపి ఆందోళన చేయడంతో పాటు తాము అధికారంలో కొస్తే వాస్తవ నష్టాలకనుగుణంగా పరిహారం ఇస్తామని హామీ ఇచ్చింది. వైసిపి వచ్చి రెండున్నరేళ్లు దాటినా టిడిపి హయాంనాటి స్కేల్ ఆఫ్ అసిస్టెన్స్‌నే అమలు చేస్తోంది. మరోవైపు 15వ ఆర్థిక సంఘం సిఫారసుల మేరకు 2021-22 నుండి 2025-26 కాలానికి స్కేల్ ఆఫ్ అసిస్టెన్స్ నిర్ణయించాల్సిన కేంద్రం మీనమేషాలు లెక్కి స్తోంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిర్వాకంతో విపత్తు రైతులు పిసరంత సాయంతో సరి పెట్టుకోవాల్సి వస్తోంది.

### ఇంత తక్కువా!

పెట్టుబడి రాయితీ (ఇన్‌పుట్ సబ్సిడీ) పేరిట ప్రభుత్వం ప్రధాన పంటలకు ఇచ్చేది ఎకరాకు రూ.6 వేలు మాత్రమే. అవే పంటలకు కేంద్రం నిర్ణయించింది రూ.2,720. వరి, వేరుశనగ, పత్తి, చెరకు, మిర్చి, కూరగాయలు, ఉల్లి, పూలు, బొప్పాయి, పుచ్చకాయలకు అంతే పరిహారం. ఉదాహరణకు ఎకరా మిర్చి సాగుకు రైతుకు రూ.లక్ష పెట్టుబడి అవుతుంది. కౌలు రైతులకు మరో రూ.50 వేలు అదనం. ప్రభుత్వం ఇచ్చేది రూ.6 వేలు. వరి సాగుకు రైతు పెట్టేది రూ.20 వేలు. కౌలు రైతులైతే రూ.30 వేలు. సర్కారు ఇస్తున్నది రూ.6 వేలు. ఈ సాయం కూడా ఐదెకరాల్లోపు రైతులకే. మామిడి, నిమ్మజాతి పండ్ల తోటలకుకు రూ.8 వేలు కాగా అరటికి రూ.10 వేలు.

### ఇదేం సాయం?

2010-15 కాలానికి 13వ ఆర్థిక సంఘం సూచనల మేరకు అప్పటి యుపిఎ సర్కారు 2013లో స్కేల్ ఆఫ్ అసిస్టెన్స్ నిర్ణయించింది. మెట్ట ప్రాంతాల్లో ఎకరాకు రూ.1,800, సాగునీటి సౌకర్యం కలిగిన ఏరియాలో రూ.3,600, దీర్ఘకాలిక పంటలకు రూ.4,800గా నిర్ణయించింది. అప్పటికే ఉమ్మడి ఎపి ప్రభుత్వం అంతకంటే ఎక్కువే ఇచ్చింది. ప్రధాన పంటలకు ఎకరాకు రూ.4 వేలు ఇస్తోంది. ఆ మేరకు విభజనకు ముందు 2014 ఫిబ్రవరి 5న జిఒ నెం.4 విడుదలైంది. నవ్యాంధ్ర ఏర్పడ్డాక హుదూద్ తుపాను సమయంలో టిడిపి ప్రభుత్వం ప్రధాన పంటలకు స్కేల్ ఆఫ్ అసిస్టెన్స్ రూ.6 వేలు చేస్తూ 2014 అక్టోబర్ 12న జివొ నెం.9 ఇచ్చింది. అనంతరం 2015-20 కాలానికి 14వ ఆర్థిక సంఘం సిఫారసుల మేరకు మోడీ ప్రభుత్వం సాయాన్ని సవరించగా, అంతకంటే ఎపిలో ఎక్కువ సాయం ఇస్తున్నందున, కేంద్ర ఆదేశాలను స్వీకరిస్తూనే, హుదూద్ నాటి సాయాన్ని కొనసాగిస్తూ 2015 డిసెంబర్ 12న జివొ 15 జారీ చేసింది. కేంద్రం సూచనల మేరకు పరిహారం పరిమితిని 50 శాతం నుండి 33 శాతానికి సవరించింది. అంతకుముందు 50 శాతం పంట నష్టపోతేనే పరిహారం ఇచ్చేవారు. ఇప్పుడు 33 శాతం డ్యామేజి అయినా ఇస్తున్నారు. ఆ జీవోనే ఇప్పటికీ అమల్లో ఉంది. గడచిన ఏడేళ్లలో సాగు ఖర్చులు కొన్ని రెట్లు పెరిగాయి. కోవిడ్ సంక్షోభం, డీజిల్, పెట్రోలు ధరల పెరుగుదల రైతులకు భారంగా పరిణమించాయి. అయినా సర్కారు పరిహారం పెంచట్లేదు. కేంద్రంతో సంబంధం లేకుండా స్థానిక పరిస్థితుల కనుగుణంగా గతంలో రాష్ట్ర ప్రభుత్వాలు సాయాన్ని పెంచిన సందర్భాలున్నాయి. వైసిపి సర్కారు ఆ దిశగా ఆలోచించట్లేదని విమర్శలొస్తున్నాయి.

**స్కేల్ ఆఫ్ అసిస్టెన్స్**

| పంట | 2014 | | 2015 | |
|---|---|---|---|---|
| | కేంద్ర | రాష్ట్రం | కేంద్రం | రాష్ట్రం |
| వరి, వేరేశనగ, పత్తి, చెరకు, మిర్చి, కూరగాయలు, పూలు ఉల్లి, బొప్పాయి, పుచ్చకాయలు | రూ.1,800 | రూ.4,000 | రూ.2,720 | రూ.6,000 |

# ఇన్‌పుట్ సబ్సిడీకి ఇ-క్రాప్ అడ్డు

**• నాల్గవ వంతు విస్తీర్ణానికి దక్కని పరిహారం • 3 లక్షల ఎకరాలకు కోత**



గతేడాది నవంబర్‌లో కురిసిన భారీ వర్షాలకు దెబ్బతిన్న పంటల్లో నాల్గవ వంతు విస్తీర్ణానికి సర్కారీ పెట్టుబడి రాయితీ (ఇన్‌పుట్ సబ్సిడీ) అందలేదు. అన్ని జిల్లాల్లో కలుపుకొని 12.21 లక్షల ఎకరాల్లో పంటలకు నష్టం వాటిల్లిందని వ్యవసాయశాఖ నిర్వహించిన క్షేత్ర స్థాయి పరిశీలనలో తేల్చగా, దాదాపు మూడు లక్షల ఎకరాలకు ఇన్‌పుట్ సబ్సిడీ దక్కలేదు. డ్యామేజి అయిన విస్తీర్ణంలో 9.19 లక్షల ఎకరాలకే పరిహారం అందింది. విపత్తు సహాయ నిబంధనల మేరకు 33 శాతం, అంతకంటే ఎక్కువ పంట నష్టం జరిగితే ఇన్‌పుట్ సబ్సిడీ వస్తుంది. కాగా పూర్తిగా పంట పోయిందని ఎన్యూమరేషన్ బృందాలు గుర్తించినప్పటికీ ఇ-క్రాప్ పోర్టల్‌లో సరిగ్గా సాగులు నమోదు కానందున కళ్ల ముందు పంటలు డ్యామేజి అయినప్పటికీ పరిహారం ఇవ్వలేదని రైతులు గగ్గోలు పెడుతున్నారు. ఇదిలా ఉండగా ఇన్‌పుట్ సబ్సిడీ కోసం పంట నష్టాలు నమోదు చేస్తే, ఆ సర్వే నెంబర్‌లో పండిన పంటలకు ప్రభుత్వ కొనుగోలు కేంద్రాల్లోకి ఎంట్రన్స్ లేదని ప్రభుత్వం విధించిన కండీషన్‌కు భయపడ్డ కొంత మంది రైతులు ఇన్‌పుట్ సబ్సిడీ వదులుకున్నట్లు చెబుతున్నారు.

### వంద కోట్లు లాస్

నవంబర్ వర్షాలకు పంటలు దెబ్బతిన్న రైతులకు మొన్న 15న ప్రభుత్వం ఇన్‌పుట్ సబ్సిడీ విడుదల చేసింది. 10.10 లక్షల ఎకరాల్లో వ్యవసాయ, హార్టికల్చర్, సెరి కల్చర్ రైతులకు రూ. 542 కోట్లు జమ చేసింది. ఒక్క వ్యవసాయ పంటలే 12,21,900 ఎకరాల్లో దెబ్బతిన్నాయని అప్పట్లోనే వ్యవసాయశాఖ అంచనాలు రూపొందించింది. వరి, వేరుశనగ, పత్తి, శనగ పంటలు అత్యధికంగా దెబ్బతిన్నాయి. కడప, అనంతపురం, తూర్పుగోదావరి, గుంటూరు జిల్లాల్లో డ్యామేజి ఎక్కువ జరిగింది. దాదాపు పది లక్షల టన్నుల వివిధ పంట ఉత్పత్తులు దెబ్బతిన్నాయి. పంట ఉత్పత్తుల డ్యామేజి విలువ రూ. 2,779 కోట్లుగా అంచనా వేశారు.

### కౌల్దార్లే ఎక్కువ

పంట నష్టం 12.21 లక్షల ఎకరాల్లోకాగా, పరిహారం పంపిణీ దగ్గరకొచ్చేసరికి ఆ విస్తీర్ణం 9,19,391 ఎకరాలకు తగ్గిపోయింది. పంటలు దెబ్బతిన్న విస్తీర్ణంలో 3,02,509 ఎకరాలకు ఇన్‌పుట్ సబ్సిడీ పడలేదు. రైతులు బ్యాంకులను సంప్రదించగా పరిహారం పడలేదంటున్నారు. వ్యవసాయశాఖ వారేమో పేర్లు రాసి పంపాం, పై నుండి రాలేదని చెబుతున్నారు. దాదాపు రూ.వంద కోట్లు రైతులకు రావాల్సి ఉంది. పరిహారం దక్కని వారిలో కౌలు రైతులు ఎక్కువగా ఉన్నారు.

**నవంబర్ నష్టపరిహారం**

| జిల్లా | ఎన్యూమరేషన్ ఎకరాలు | పరిహారం జమ ఎకరాలు |
|---|---|---|
| శ్రీకాకుళం | 18,509 | 6,857 |
| విజయనగరం | 2,111 | 1,719 |
| విశాఖపట్నం | 392 | 259 |
| తూర్పుగోదావరి | 1,76,492 | 1,57,813 |
| పశ్చిమగోదావరి | 41,925 | 34,731 |
| కృష్ణా | 17,931 | 9,045 |
| గుంటూరు | 1,31,607 | 1,01,361 |
| ప్రకాశం | 47,066 | 29,608 |
| నెల్లూరు | 1,745 | 2,917 |
| చిత్తూరు | 33,311 | 28,079 |
| కడప | 3,99,871 | 2,95,728 |
| అనంతపురం | 2,79,025 | 2,12,805 |
| కర్నూలు | 71,911 | 38,473 |
| మొత్తం | 12,21,900 | 9,19, 391 |



# ధాన్యం డబ్బు కోసం రైతులు పడిగాపులు

రాష్ట్రవ్యాప్తంగా పౌరసరఫరాల సంస్థ సేకరించిన ధాన్యానికి నెల దాటినా రైతులకు సొమ్ము జమ కాలేదు. మూడు వారాల్లో రైతుల ఖాతాలకు జమకావాల్సిన ధాన్యం డబ్బు ఐదు వారాలు గడిచినా జమకాలేదు. దీనివల్ల రైతులు రబీ పంటల పెట్టుబడులకు తీవ్ర ఇక్కట్లను ఎదుర్కొంటున్నారు. ధాన్యం సేకరణ ప్రారంభించిన దగ్గర్నుండి జనవరి 20 వరకు సేకరించిన ధాన్యానికి ప్రభుత్వం చెప్పిన గడువు 21రోజులకు కొంచెం అటు ఇటుగా చెల్లింపులు పూర్తయ్యాయి. 23.64లక్షల మెట్రిక్ టన్నులకు సుమారు రూ.2,206.17కోట్లను పౌరసరఫరాల సంస్థ రైతుల ఖాతాల్లోకి చెల్లింపులు పూర్తిచేసినట్లు సమాచారం. జనవరి 20 తర్వాత నుండి సేకరించిన ధాన్యానికి చెల్లింపులు చేసేందుకు కార్పొరేషన్ వద్ద నిధులు లేవు. కార్పొరేషన్ సమీకరించుకోవాల్సిన అప్పులు సకాలంలో రాకపోవడంతో ఇప్పుడు ఇబ్బందులు పెరిగాయి. పౌరసరఫరాల సంస్థకు రూ.5వేల కోట్ల అప్పు తీసుకునేందుకు అనుమతినిస్తూ రాష్ట్ర ప్రభుత్వం డిసెంబర్ 7న ఉత్తర్వులు జారీ చేసింది. కమర్షియల్ బ్యాంకులు, ప్రైవేటు సంస్థల నుండి అప్పు తీసుకోవాలని, దీనికి ప్రభుత్వం షూరిటీ ఉంటుందని ఉత్తర్వుల్లో పేర్కొన్నారు. మూడు నెలలు కావస్తున్నా సంస్థకు ఇప్పటికీ అప్పు లభించలేదని సమాచారం.

పౌరసరఫరాల సంస్థ జనవరి 20 నుండి ఫిబ్రవరి 25 వరకు 12.30లక్షల మెట్రిక్ టన్నుల ధాన్యాన్ని సేకరించింది. దీనికి గాను 1.91లక్షల మంది రైతులకు, అదేవిధంగా అంతకు ముందు ఉన్న కొన్ని పెండింగ్‌లతో కలిపి సుమారు రూ.2,500కోట్లు చెల్లింపులు చేయాల్సి ఉంది. డబ్బులు చెల్లించలేకనే ఖరీఫ్ ధాన్యం సేకరణకు సంబంధించిన వెబ్‌సైట్ల సర్వర్ల వేగాన్ని పౌరసరఫరాల సంస్థ తగ్గించిందనే విమర్శలు బలంగా వినిపిస్తున్నాయి. తమకు రావాల్సిన డబ్బు కోసం రైతులు ఆర్‌బికెలు, బ్యాంకుల చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారు. ఖరీఫ్ సాగుకు తెచ్చిన అప్పులు చెల్లించాలని, మినుము పంటకు అయ్యే ఖర్చులకు చేతిలో చిల్లిగవ్వ లేదని రైతులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఖర్చులకు రైతులు కొత్త అప్పులు చేయాల్సి వస్తోంది. ప్రభుత్వం త్వరగా డబ్బులు చెల్లించి ఆదుకోవాలని రైతులు కోరుతున్నారు. ఇదిలా ఉండగా మార్చి నుండి రబీ ధాన్యం సేకరణ చేయాల్సి ఉంది. ఖరీఫ్ డబ్బులకే సంస్థ ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటుంది, రబీకి ఏ విధంగా చెల్లింపులు చేస్తారన్నది ప్రశ్నగా ఉంది. ప్రభుత్వం ఖరీఫ్ చెల్లింపులకు ఎటువంటి చర్యలు తీసుకుంటుందో వేచి చూడాలి. వివిధ జిల్లాల రైతులకు పౌరసరఫరాల సంస్థ చెల్లించాల్సిన చెల్లింపుల వివరాలు పట్టికలో చూడొచ్చు.

| జిల్లా పేరు | చెల్లింపుల పెండింగ్ (రూ.కోట్లలో) |
|---|---|
| శ్రీకాకుళం | రూ.615.87 |
| కృష్ణా | రూ.479.54 |
| విజయనగరం | రూ.380.13 |
| పశ్చిమగోదావరి | రూ.331.39 |
| గుంటూరు | రూ.258.01 |
| తూర్పుగోదావరి | రూ.251.53 |
| విశాఖ | రూ.37.94 |
| ప్రకాశం | రూ.35.11 |
| కర్నూలు | రూ.1.98 |
| కడప | రూ.1.1 |
| చిత్తూరు | రూ.0.37 |
| నెల్లూరు | రూ.0.21 |
| అనంతపురం | రూ.0.07 |

# 'కావేరి' జాదు పత్తి విత్తుల కల్తీతో రైతులకు తీవ్ర నష్టం

నకిలీ, కల్తీ పత్తి విత్తనాలు అంటగట్టి రైతులను నట్టేట ముంచిన కావేరి కంపెనీపై ప్రభుత్వం వల్లమాలిన జాలి చూపిస్తోందని విమర్శలొస్తున్నాయి. మొన్న ఖరీఫ్‌లో కావేరి కంపెనీ 'జాదు' పేరిట విక్రయించిన బోల్‌గార్డ్-2 పత్తి విత్తనాలు చాలా చోట్ల వేల ఎకరాల్లో విఫలమయ్యాయి. సదరు విత్తనాలు వేసిన రైతులు భారీ పంట నష్టాలను చవి చూశారు. పలు ప్రాంతాల్లో గుంటూరు లాం ఫాం, నంద్యాల విత్తన పరిశోధనా కేంద్రాల శాస్త్రవేత్తలు సీడ్స్‌లో కల్తీ జరిగిందని, అందుకే పంట నష్టం వాటిల్లిందని ధ్రువీకరించారు. ఎపి కాటన్ సీడ్ యాక్ట్-2007ను ప్రయోగించి కావేరి కంపెనీపై కఠిన చర్యలతో పాటు పంట నష్టపోయిన రైతులకు న్యాయమైన పరిహారం ఇప్పించే అవకాశం ప్రభుత్వానికి ఉన్నప్పటికీ, ఎందుకనో జంకుతోందని ఆరోపణలొస్తున్నాయి. సీడ్ యాక్ట్‌తో సర్కారుకు శక్తిమంతమైన అధికారాలు దఖలు పడినప్పటికీ వాటిని ఉపయోగించట్లేదని సమాచారం. సాంకేతిక కారణాలు చూపించి పరిహారం ఎగ్గొట్టేందుకు కావేరి చేస్తున్న ప్రయత్నాలకు ప్రభుత్వం పరోక్షంగా సహకరిస్తున్నట్లు ఆరోపణలొస్తున్నాయి.

### కమిటీ అవార్డ్ గాలికి

విత్తనాల్లో కల్తీ వల్లనే పంట పోయిందన్న శాస్త్రవేత్తల నిర్ధారణ దరిమిలా, చట్ట ప్రకారం కర్నూలు వ్యవసాయశాఖ వేసిన కమిటీ, 7,800 ఎకరాల్లో నష్టానికిగాను, ఎకరాకు రూ.23 వేల వంతున కావేరి సంస్థ పరిహారం ఇవ్వాలని డిసెంబర్ చివరిలో అవార్డ్ చేసింది. నెల రోజులు గడువు విధించింది. ఆ ఆదేశాలను కంపెనీ పట్టించుకోలేదు సరికదా కోర్టుకెళ్లింది. వ్యవసాయశాఖ సకాలంలో స్పందించి ఉంటే కోర్టు వివాదం తలెత్తేది కాదని, ఇప్పటికైనా చట్టం ఇచ్చిన అధికారాలతో కోర్టులో పిటిషన్‌ను డిస్‌మిస్ చేయించొచ్చన్నది నిపుణుల మాట. ఒక్క కర్నూలులోనే 'జాదు' బాధిత విస్తీర్ణం 30-40 వేల



ఎకరాల వరకు ఉంటుందని చెబుతున్నారు. ఇంకా గుంటూరు, కడప, అనంతపురం తదితర జిల్లాల్లోనూ జాదు విత్తనాలు విఫలమై రైతులు నష్టపోయారని సమాచారం.

### ఆర్‌బికెలలో అనుమతి

వ్యవసాయ ఉత్పాదకాల విక్రయాలకు గ్రామాల్లో ప్రభుత్వం నిర్వహిస్తున్న రైతు భరోసా కేంద్రాల (ఆర్‌బికె)లో కావేరి జాదు విత్తనాల విక్రయాలకు ఖరీఫ్‌లో అనుమతించారని తెలిసింది. ఆర్‌బికెలలో దొరికే విత్తనాల జాబితాలో కొన్ని చోట్ల 'జాదు' కూడా ఉందంటున్నారు. నాణ్యతా పరీక్షలు చేశాకే ఆర్‌బికెలలో విత్తనాలమ్ముతారంటుండగా, ఒక వేళ జాదు విత్తనాలు అమ్మి ఉంటే పరీక్షలు చేశారో లేదో తేలాల్సి ఉంది. ఏ విత్తనాలైనా మార్కెట్‌లో అమ్మాలంటే వ్యవసాయశాఖ తనిఖీలు, ధ్రువీకరణ, అనుమతులు తప్పనిసరి. జాదు కల్తీ విత్తనాలు ఏ విధంగా రైతులకు చేరాయో విచారణ చేయాల్సి ఉంది. ఇదిలా వుండగా, నకిలీ అని ధ్రువీకరించాక చట్ట ప్రకారం కావేరిపై క్రిమినల్ చర్యలు తీసుకొని బ్లాక్ లిస్టులో పెట్టాలి. ఆ సంస్థ విత్తనాలన్నింటినీ నిషేధించాలి. ఏ కారణం చేతనో ప్రభుత్వం ఇంత వరకు ఆ పని చేయలేదని ఆరోపణలొస్తున్నాయి.

# రైతుల సమస్యలపై జీపుజాతా

ధాన్యం కొనుగోలు చేయాలని, చెరకు బకాయిలు చెల్లించాలని డిమాండ్ చేస్తూ ఎపి రైతు, కౌలురైతు, వ్యవసాయ కార్మిక సంఘాల ఆధ్వర్యాన మంగళవారం జీపుజాతా చేపట్టారు. విజయనగరం జిల్లా జియ్యమ్మవలస మండలంలోని పెదమేరంగి కూడలిలో జీపుజాతాను సర్పంచ్ జోగి భుజంగరావు జెండా ఊపి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఎపి రైతు సంఘం జిల్లా నాయకులు రెడ్డి వేణు మాట్లాడుతూ.. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ విధానాల వల్ల రైతులు పూర్తిగా నష్టపోతున్నారని తెలిపారు. వ్యవసాయంలో పెట్టుబడులు పెట్టి ధాన్యాన్ని పండిస్తే అమ్ముకోలేక రైతులు ఇబ్బందులు పడుతున్నారని తెలిపారు. అమ్ముకున్నా డబ్బులు రాక అవస్థలు పడుతున్నారన్నారు. రైతుల నుంచి ధాన్యం కొనుగోలులో ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోందని ఆగ్రహం వ్యక్తం చేశారు. ఏడాది నుంచి చెరకు రైతుల బకాయిలు నిలిచిపోయాయని, రైతులు రోడ్డెక్కినా వారి న్యాయమైన డిమాండ్లను పరిష్కరించడం లేదన్నారు. చక్కెర



పరిశ్రమలు మూసేయడంతో రైతులు రోడ్డున పడ్డారని ఆవేదన వ్యక్తంచేశారు. ప్రభుత్వం స్పందించి ధాన్యం కొనుగోలు చేయాలని, చెరకు రైతులకు బకాయిలు చెల్లించాలని డిమాండ్ చేశారు. పార్వతీపురం డివిజన్లో నాలుగు రోజులపాటు జీపు జాతా కొనసాగుతుందని, 25న ఆర్‌డిఒ కార్యాలయం ఎదుట ధర్నా చేస్తామని తెలిపారు.

# సేకరించేది 40 లక్షల టన్నులే ?

ఖరీఫ్ (2021-22) సీజన్‌లో రాష్ట్ర ప్రభుత్వం 40లక్షల టన్నుల ధాన్యం మాత్రమే సేకరించనుందని సమాచారం. 50లక్షల టన్నుల సేకరణ లక్ష్యంగా ప్రకటించి ఇప్పుడు దానికి కోత పెడుతోందని తెలిసింది. ప్రభుత్వం ఇప్పటి వరకు పౌరసరఫరాల సంస్థ 35.23లక్షల టన్నుల ధాన్యాన్ని సేకరించింది. మరో 5లక్షల టన్నులు సేకరించి ఖరీఫ్ ధాన్యం సేకరణను నిలిపేసే విధంగా చర్యలు ప్రారంభించనట్లు సమాచారం. ఇటీవల మంత్రి కొడాలి నాని ఓ ప్రెస్‌మీట్‌లో కూడా దాదాపు ధాన్యం సేకరణ పూర్తికావొచ్చిందని 45లక్షల మెట్రిక్ టన్నులు సేకరిస్తే లక్ష్యం పూర్తవుతుందని అన్నారు. ప్రస్తుతం సర్వర్లు మొరాయించడం దీనికి సంకేతమని రైతులు భావిస్తున్నారు. ఖరీఫ్ 2021-22కు సంబంధించి ముఖ్యమంత్రి సంబంధిత అధికారులతో 2021 నవంబర్‌లో సమీక్ష నిర్వహించి రాష్ట్రంలో 87లక్షల మెట్రిక్ టన్నుల ధాన్యం దిగుబడి వస్తుందని, దీనిలో పౌరసరఫరాల సంస్థ 50 లక్షల టన్నులు సేకరించడానికి ఏర్పాట్లు పూర్తి చేయాలని ఆదేశించారు. ఆ మేరకు 2021 నవంబర్ 9న ఖరీఫ్ ధాన్యం సేకరణకు సంబంధించిన ఆదేశాలు, నిబంధనావళిని ప్రభుత్వం విడుదల చేసింది. దీనిలో పేర్కొన్న అంచనాల ప్రకారం 2022 ఫిబ్రవరి 22 నాటికి 43,03,144 మెట్రిక్ టన్నుల సేకరణ పూర్తికావాల్సి ఉంది. మార్చి 22కు 50లక్షల టన్నుల లక్ష్యం పూర్తి చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ప్రభుత్వ ఆదేశాలు, ప్రకటనలకు భిన్నంగా ధాన్యం సేకరణలో అనూహ్య మార్పులు చోటు చేసుకోవడం, మరో 15లక్షల టన్నుల సేకరణ చేయాల్సిఉండగా సర్వర్లు మొరాయింపు, మంత్రి ప్రకటన రైతుల్లో ఆందోళన రేకెత్తిస్తున్నాయి. ఈనెల 21 సోమవారంనాడు రాష్ట్రంలో ఒక్క గింజ ధాన్యం కూడా సేకరించలేదు. గత వారంలో రోజుకు సరాసరిన



ఐదు వేల మెట్రిక్ టన్నులు మాత్రమే సేకరణ జరిగింది. ఈ సీజన్‌లో డిసెంబర్, జనవరిలో కురిసిన అకాల వర్షాలు, వాతావరణ మార్పుల వల్ల రైతులు వరి నూర్పిడిని వాయిదా వేసుకున్నారు. వాతావరణం సరయ్యేనాటికి మినుము పంట పూత, పిందె రావడంతో వరి నూర్పిడి చేయడానికి రైతులకు అవకాశం లేకుండా పోయింది. ఇలా ఇంకా వరి నూర్పిడి చేయని ధాన్యం రాష్ట్రంలో మరో 20లక్షల టన్నుల వరకూ ఉంటుందని అంచనా. ప్రభుత్వం ధాన్యం సేకరణ నిలిపేస్తే తమ పరిస్థితి ఏంటని రైతులు ప్రభుత్వాన్ని అడుగుతున్నారు.

### నెలదాటినా చెల్లింపులేవి ?

ధాన్యం సేకరణ పూర్తయిన 21 రోజుల్లో డబ్బులు చెల్లించాల్సి ఉండగా ఆచరణలో అది జరగడం లేదు. సేకరణ ప్రారంభ సమయంలోనే జరిగిందని, రెండు నెలల తర్వాత అది జరగడంలేదని ఆర్‌బికె ఇన్‌ఛార్జ్‌లే చెబుతున్నారు. ధాన్యం సేకరణ ప్రారంభంలో సకాలంలో చెల్లింపులు చేసిన పౌరసరఫరాలసంస్థ, దాన్ని ఎందుకు కొనసాగించలేకపోతోందని పలువురు ప్రశ్నిస్తున్నారు. ఇప్పటి వరకు 5,16,510 మంది రైతుల నుండి రూ.6,853కోట్ల విలువ గల ధాన్యాన్ని పౌరసరఫరాల సంస్థ సేకరించింది. వీటిలో దాదాపు సగం మొత్తం చెల్లించాల్సి ఉందని సమాచారం. ✷

# పిడుగురాళ్ల ప్రాంతంలో రైతు సంఘ బృందం మిర్చి పైరు పరిశీలన

వైరస్ తెగులు వల్ల నష్టపోయిన మిర్చి రైతులను సత్వరమే ఆదుకోవాలని రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు వి. కృష్ణయ్య ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు ఫిబ్రవరి 8న రైతు సంఘం ఆధ్వర్యంలో పిడుగురాళ్ళ మండలంలో మిర్చి పైరు పరిశీలించారు ఈ సందర్భంగా గా రైతులు తమ ఆవేదనను రైతు సంఘం బృందం ముందు వెలిబుచ్చారు ఈ సందర్భంగా కృష్ణయ్య మాట్లాడుతూ గత సంవత్సరం తో పోలిస్తే ఈ సంవత్సరం మిర్చి సాగు రైతులు ఎక్కువగా సాగు చేశారని అన్నారు ఊహించని విధంగా తామర పురుగు నల్లి తదితర వైరస్ల వల్ల పంట పూర్తిగా దెబ్బతిని రైతాంగం దిక్కుతోచని స్థితిలో పడిపోయింది అన్నారు. లక్షలాది రూపాయలు ప్రైవేటు వడ్డీ వ్యాపారుల నుండి తీసుకొచ్చి పెట్టుబడి పెట్టిన రైతుల బతుకు పెనం మీద నుండి పొయ్యిలో పడ్డట్టయింది అని ఆవేదన వ్యక్తం చేశారు. రైతు సంఘం జిల్లా కార్యదర్శి ఏపూరి గోపాలరావు మాట్లాడుతూ మిర్చి రైతులకు పరిహారం కోసం ఈనెల 14వ తేదీ కలెక్టర్ కార్యాలయం ఎదుట పరిహారం కోసం జరిగే జరిగే సామూహిక దీక్షలు రైతులు పెద్ద ఎత్తున పాల్గొని జయప్రదం చేయాలని పిలుపునిచ్చారు ✷

# మినుము, పెసర, శనగ పంటలకు
# కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేయాలి

రాష్ట్రంలో మినుములు, పెసలు, శనగలు కొనుగోలు చేసేందుకు తక్షణమే కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆంధ్రప్రదేశ్ కౌలురైతుల సంఘం రాష్ట్ర కమిటీ డిమాండ్ చేసింది. సంఘం రాష్ట్ర అధ్యక్షులు రాధాకృష్ణ అధ్యక్షతన ఫిబ్రవరి 17న జరిగిన ఆన్‌లైన్ సమావేశం పంటల కొనుగోలుపై ప్రభుత్వం తీసుకోవాల్సిన చర్యలు, పలు అంశాలపై చర్చించి పలు తీర్మానాలు చేసింది. సమావేశంలో వక్తలు మాట్లాడుతూ, కృష్ణా జిల్లాలో మినుములు, పెసలు మార్కెట్‌కు వచ్చి నెలరోజులు పూర్తవుతున్నా కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేయలేదన్నారు. దీంతో రైతులు మద్దతు ధర కన్నా తక్కువకు పంటలను అమ్ముకుని నష్టపోతున్నారని తెలిపారు. రాష్ట్ర ప్రభుత్వం మద్దతు ధరకు పంటలను కొనుగోలు చేసి కౌలురైతులను ఆదుకోవాలని కోరారు.రైతు భరోసా కేంద్రాలు నేరుగా రైతుల దగ్గర నుంచి ధాన్యం కొనుగోలు చేయడంలో విఫలమయ్యాయని విమర్శించారు. రాష్ట్ర ప్రభుత్వం కొనుగోలు చేయకపోవడం వల్ల ఇప్పటికీ విజయనగరం, కృష్ణా జిల్లాలో 40 శాతం ధాన్యం కుప్పల రూపంలో నిల్వ ఉండిపోయిందన్నారు. ధాన్యం కొనుగోలు చేయండి అని ఆర్‌బికెకు వెళ్లిన రైతులను అధికారులు మిల్లర్ల వద్దకు పంపుతున్నారని తెలిపారు. మిల్లర్లు ధాన్యం ముక్కలవుతుందనే వంక చూపి తక్కువ ధరకు ఇస్తే తీసుకుంటామని చెబుతున్నారని పేర్కొన్నారు.



ప్రభుత్వం వెంటనే జోక్యం చేసుకుని మినుములు, పెసలు పండిన ప్రాంతాల్లో మార్కెట్ యార్డు కమిటీ పరిధిలో కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేయాలని కోరారు. రైతు భరోసా కేంద్రాలే ధాన్యాన్ని సేకరించి, 72 గంటల్లో ధాన్యం డబ్బులు రైతుకు చెల్లించాలని డిమాండ్ చేశారు. సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి జమలయ్య తీర్మానాన్ని ప్రవేశపెడుతూ, రాష్ట్ర ప్రభుత్వం తీసుకొచ్చిన నూతన కౌలురైతుల చట్టాన్ని సవరించి గ్రామసభలు జరిపి, భూ యజమానులతో సంబంధం లేకుండా కౌలు గుర్తింపు కార్డులు జారీ చేయాలని కోరారు. రబీలో కౌలురైతులకు వడ్డీలేని పంటరుణాలు ఇవ్వాలని, ఇన్‌పుట్ సబ్సిడీ, రైతుభరోసా తదితర రాయితీలు కౌలురైతులకు ఇప్పించాలని డిమాండ్ చేశారు.

# గోవాడ షుగర్ ఫ్యాక్టరీ వద్ద ఉద్రిక్తత..

## కార్మికుల సమ్మె శిబిరంపై పోలీసుల ఉక్కుపాదం

గోవాడ షుగర్ ఫ్యాక్టరీ వద్ద ఫిబ్రవరి 18న ఉదయం 10 గంటలనుండి ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది. మేనేజ్‌మెంట్‌తో సంప్రదింపులు జరిపిన తర్వాత 17 నుండి నుండి సమ్మె చేస్తామని కార్మికులు గత 15 రోజుల కిందట తెలిపారు. ఈ నేపథ్యంలో... ఈరోజు కార్మికుల సమ్మె శిబిరాన్ని తొలగించడానికి పోలీసులు ప్రయత్నించగా పోలీసులకు, కార్మికులకు మధ్య వాగ్వాదం చోటుచేసుకుంది. ఈ ఘర్షణలో సంఘ అధ్యక్షుడు శ్రీను స్పృహ కోల్పోయారు. కార్మికులు మాట్లాడుతూ ... గత 25 సంవత్సరాల నుండి ఫ్యాక్టరీలో పనిచేస్తున్న 400 మంది కార్మికులకు అన్యాయం జరుగుతుందని ఆవేదన చెందారు. ఇప్పటివరకు యాజమాన్యం కానీ నాయకులు కానీ తమను పట్టించుకోవడం లేదని తెలిపారు. మధ్యవర్తులను తప్పించి నేరుగా కార్మికుల అకౌంట్లోకి వేతనాలను వేసినట్లయితే సుమారుగా సంవత్సరానికి పది లక్షల రూపాయల వరకు మిగులుతుందని, అలా కాని పక్షంలో కార్మికశాఖ జిఒ ప్రకారం అందరి జీతాలను చెల్లించాలంటూ.. మేనేజ్మెంట్‌వారిని కలిసి చాలాసార్లు చర్చించామని అయినప్పటికీ వారు స్పందించలేదని



వాపోయారు. దీంతో గత్యంతరం లేక 17 వ తారీకు నుండి సమ్మెకు దిగడంతో యాజమాన్యం, పోలీసులతో కుమ్మక్కయ్యి సమ్మె శిబిరాన్ని తీయడానికి ప్రయత్నించడంతో పోలీసులకు, కార్మికులకు మధ్య ఘర్షణ వాతావరణం ఏర్పడిందని ఆవేదన చెందారు.

# పంపు సెట్లకు మీటర్లను తిరస్కరించాలి

పంపు సెట్లకు మీటర్లు బిగించే ప్రసక్తేలేదని తెలంగాణ ముఖ్యమంత్రి కెసిఆర్ ప్రకటించిన విధంగా, మన ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి కూడా ప్రకటించాలని ఎపి రైతు సంఘం రాష్ట్ర కమిటీ డిమాండ్ చేసింది. ఈ మేరకు సంఘం రాష్ట్ర అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు వై.కేశవరావు, మర్రాపు సూర్యనారాయణ ఫిబ్రవరి 12న ప్రకటన విడుదల చేశారు. కేంద్రం తీసుకొచ్చిన విద్యుత్తు సంస్కరణలను అమలు చేయబోమని, ధాన్యం కొనకపోవడం, సబ్సిడీలు ఇవ్వబోమని కేంద్రం పెట్టిన షరతులను లెక్కచేయబోమని తెలంగాణ ముఖ్యమంత్రి ప్రకటించడం హర్షణీయమని పేర్కొన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్రం ఆదేశాలకు తలొగ్గి జిఓ 22 విడుదల చేయడం, మార్చి 1 నుంచి సెంట్రల్ విద్యుత్తు జోన్‌లో మీటర్ల ఏర్పాటుకు సిద్ధం కావడం సరైంది కాదన్నారు. రైతు సంఘాలు, రైతాంగం వ్యతిరేకిస్తున్నా మీటర్లు బిగించేందుకు సిద్ధం కావడం సరికాదన్నారు. కేంద్రం తెచ్చే సంస్కరణల వల్ల మొత్తం విద్యుత్తు రంగం ప్రైవేటు కంపెనీల వశం అవుతుందని, అప్పుడు రాష్ట్ర ప్రభుత్వం మాట వినేవారు ఎవరూ ఉండరని తెలిపారు. ఇప్పటికే 2022-23 బడ్జెట్‌లో కేంద్రం ఆంధ్రప్రదేశ్‌కు పలు రకాలుగా అన్యాయం చేసి విభజన చట్టం ప్రకారం ఇవ్వాల్సిన గ్రాంట్లు ఇవ్వడం లేదని పేర్కొన్నారు. పోలవరం ప్రాజెక్టుకు నిధులు ఇవ్వడం లేదని, నిర్వాసితులకు పునరావాసం ఇవ్వనని చెబుతోందని, వెనుకబడిన జిల్లాలకు ఇవ్వాల్సిన గ్రాంట్లకు కూడా కేంద్రం ఎగనామం పెట్టిందని తెలిపారు. సిఎం లొంగిన కొద్దీ ఎపికి కేంద్రం అన్యాయం చేస్తూనే ఉందని పేర్కొన్నారు. ముఖ్యమంత్రి ఇప్పటికైనా విద్యుత్తు సంస్కరణలు అమలు నిలిపివేయాలని, జిఓ 22ను ఉపసంహరించాలని డిమాండ్ చేశారు.




## నాసిరకం విత్తనాల కంపెనీలపై
# రెవెన్యూ రికవరీ చట్టాన్ని ఉపయోగించాలి

ఖరీఫ్ సీజనులో నాసిరకం కల్తీ పత్తి, మిరప విత్తనాలను రైతులకు అమ్మి మోసగించిన కావేరి, కళాసా తదితర కంపెనీలపై రెవెన్యూ రికవరీ చట్టాన్ని ఉపయోగించి, రైతాంగానికి నష్ట పరిహారం ఇప్పించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆంధ్రప్రదేశ్ కౌలు రైతు సంఘం డిమాండ్ చేసింది. ఈ మేరకు సంఘం రాష్ట్ర అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు వై.రాధాకృష్ణ, జి.జమలయ్య ఫిబ్రవరి 12న ప్రకటన విడుదల చేశారు. కర్నూలు జిల్లాలో ఈ ఏడాది ఖరీఫ్‌లో కావేరి విత్తనాల కంపెనీ బిటి జాదు వెరైటీ నాసిరకం పత్తి విత్తనాలను అంటకట్టిందన్నారు. విత్తనాలు వేసిన నాలుగు నెలలు దాటినా పత్తి పంటకు పూత, కాయ రాకపోవడంతో రైతులు ఆందోళన చేస్తే ప్రభుత్వం శాస్త్రవేత్తలను పంపిందన్నారు. నాసిరకం విత్తనాలు కావడంతో 50 శాతానికి పైగా పంటలు దెబ్బతిన్నాయని నిర్ధారించారని పేర్కొన్నారు. గతేడాది డిసెంబరు 18, 19 తేదీల్లో రైతులను విచారించి 16 మండలాల్లో 1800 మంది రైతులకు చెందిన 7,255 ఎకరాలకు ఎకరానికి రూ.23 వేల చొప్పున రూ.17 కోట్లు నష్టపరిహారం ఇవ్వాలని వ్యవసాయ శాఖ జాయింట్ డైరెక్టర్ స్థాయిలో ఏర్పడిన నష్ట పరిహారాల కమిటీ కావేరి కంపెనీ యాజమాన్యానికి ఆదేశాలు జారీ చేసిందని తెలిపారు. నెల రోజుల్లోగా చెల్లింపులు చేయాలని సకాలంలో చెల్లింపులు చేయకపోతే 24 శాతం వడ్డీతో కట్టాలని కమిటీ చెప్పిందన్నారు. ఇంతవరకూ కావేరి కంపెనీ యాజమాన్యం ఒక్క పైసా కూడా చెల్లించలేదన్నారు. రాష్ట్ర ప్రభుత్వం ఆ కంపెనీపై ఎటువంటి చర్యలూ తీసుకోలేదన్నారు. కృష్ణా, గుంటూరు జిల్లాల్లో కల్తీ మిరప విత్తనాలను కళాసా కంపెనీ పెదకూరపాడు, క్రోసూరు మండలాల్లో అమ్మిందన్నారు. ప్రభుత్వం తక్షణమే స్పందించి రైతులకు నష్టపరిహారం ఇప్పించాలని డిమాండ్ చేశారు.


ఆంధ్రప్రదేశ్ కౌలు రైతు సంఘం

# భీమసింగి సుగర్ ఫ్యాక్టరీ తెరవాలని వేపాడలో భారీ రాస్తారోకో

ఆధునీకరణ పేరు చెప్పి గత రెండు సంవత్సరాలుగా మూసివేతకు గురైన భీమసింగి సుగర్ ఫ్యాక్టరీ తెరవాలని వేపాడలో భారీ రాస్తారోకో నిర్వహించారు. ఈ సందర్భంగా ఏపీ రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి చల్లా జగన్ మాట్లాడుతూ జిల్లాలో ఉన్న ఏకైక సహకార సహకార కర్మాగారాన్ని మూసివేయడం తగదన్నారు, జిల్లాలో ఉన్న తెలుగు రైతాంగానికి ఆధారంగా ఉన్న షుగర్ ఫ్యాక్టరీ తెరవాలని, కార్మికులకు జీతాలు, బకాయిలు వెంటనే చెల్లించి ఆదుకోవాలన్నారు, చెరుకు రైతులను తెలుగు ద్వారా చెయ్యొద్దన్నారు, జిల్లాకు ఒక వ్యవసాయ ఆధారిత పరిశ్రమలు నిర్వహిస్తామని చెప్పిన పాలకులు రైతులకు ఎంతో ఉపయోగ పడే భీమసింగి సుగర్ ఫ్యాక్టరీ మూసేయడం తగదన్నారు, ఆధునీకరణ పేరు చెప్పి రైతులను, కార్మికులను మోసం చేసి ఫ్యాక్టరీ ఇన్ తెరవకుండా ఇతర జిల్లాలకు చెరుకును పంపించడంలో రైతులు పడుతున్న బాధలు వర్ణనాతీతము అన్నారు ఇప్పటికైనా పాలకులు స్పందించి షుగర్ ఫ్యాక్టరీ నివెంటనే తెరిచి రైతులను కార్మికులను కావాలన్నారు, ఫ్యాక్టరీ తెరిచే వరకు రూపాలలో ఆందోళన ఉధృతం చేస్తామన్నారు ఈ కార్యక్రమంలో రైతు సంఘం నాయకులు మిగతాన పరదేశి నాయుడు రౌతు బాబురావు, దేగల రాము ప్రకాష్, గణపతి తదితర చెరుకు రైతు సంఘం నాయకులు పాల్గొన్నారు.

### లఖింపూర్ రైతుల నరమేధం కేసులో

# ఆశిష్ మిశ్రాకి బెయిల్ దారుణం

**- ఏఐకెఎస్**

ఉత్తరప్రదేశ్‌లోని లఖింపూర్ ఖేరి కారుతో తొక్కించి రైతులను హత్య చేసిన కేసులో ప్రధాన నిందితుడిగా ఉన్న కేంద్ర హెూంశాఖ సహాయ మంత్రి కుమారుడు, బిజెపి నేత ఆశిష్ మిశ్రా బెయిల్‌పై విడుదలయ్యారు. అలహాబాద్ హైకోర్టు ఫిబ్రవరి 10న ఆయనకు బెయిల్ మంజూరు చేసింది. లఖింపూర్ ఖేరీ కేసులో ప్రధాన నిందితుడిగా పేర్కొన్న ఆశిష్ మిశ్రాని గతేడాది అక్టోబర్ నెలలో పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. గతేడాది అక్టోబర్ 3న యుపిలోని లఖింపూర్ ఖేరిలో నల్ల చట్టాలకు వ్యతిరేకంగా శాంతియుతంగా నిరసన తెలుపుతున్న రైతులను కారుతో తొక్కించిన ఘటన దేశవ్యాప్తంగా వివాదాస్పదమైన సంగతి తెలిసిందే. ఈ ఘటనలో నలుగురు రైతులు మృచెందగా, అనంతరం చెలరేగిన హింసాత్మక ఘటనలో మరో నలుగురు ప్రాణాలు కోల్పోయారు. నిందితుడు ఆశిష్ మిశ్రాని అదుపులోకి తీసుకున్నప్పటికీ విచారణకు సహకరించలేదని పోలీసులు వెల్లడించారు. అనంతరం పలుమార్లు కస్టడీలోకి తీసుకొని విచారించినట్లు సమాచారం. అయితే యుపి అసెంబ్లీ ఎన్నికలు ప్రారంభమైన రోజే ఆశిష్‌కు బెయిల్ లభించింది. యుపిలో మొత్తం ఏడు దశల్లో పోలింగ్ జరగనుండగా.. లఖింపూర్ ఖేరీలో నాలుగో దశలో ఎన్నికలు జరగనున్నాయి. కాగా, లఖింపూర్ ఖేరీ కేసులో ఆశిష్ మిశ్రాకు బెయిల్ లభించడంతో ఆర్ఎల్‌డి నేత జయంత్ చౌదరి బిజెపిపై విరుచుకుపడ్డారు. నలుగురు రైతులను హతమార్చిన నిందితుడికి నాలుగు నెలల్లో బెయిల్ లభించిందని చౌదరి ట్వీట్ చేశారు.



#### బెయిలు దురదృష్టకరం : ఏఐకెఎస్

లఖింపూర్ ఖేరీ కేసులో ప్రధాన నిందితుడైన ఆశిష్ మిశ్రాకి బెయిల్ మంజూరు చేస్తూ అలహాబాద్ హైకోర్టు ఇచ్చిన తీర్పుపై అఖిల భారత కిసాన్ సభ (ఏఐకెఎస్) తీవ్ర దిగ్భ్రాంతి వ్యక్తం చేసింది. ఏఐకెఎస్ అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు అశోక్ ధావలే, హన్నన్‌మొల్లా ఫిబ్రవరి 10న ఈ మేరకు ఒక ప్రకటన విడుదల చేశారు. ఆశిష్ మిశ్రాకి బెయిల్ న్యాయ విరుద్ధమని, దీని వెనక కుట్ర దాగి ఉందని సుప్రీం కోర్టు నేతృత్వంలోని సిట్ అభిప్రాయ పడుతుండగా, బెయిల్ ఇవ్వడం దారుణమని అన్నారు. ఆశిష్ మిశ్రా, ఇతరులపై ఐపిసిలోని సెక్షన్ 302 (హత్య), సెక్షన్ 307 (హత్యా ప్రయత్నం), ఇతర అత్యంత తీవ్రమైన సెక్షన్ల కింద అభియోగాలు మోపబడ్డాయని వారు తెలిపారు. హైకోర్టు ఇచ్చిన ఆదేశం న్యాయ ప్రమాణాలకు విరుద్ధమని, ప్రజలను హతాశుల్ని చేసిందన్నారు. లఖింపూర్ ఖేరీ ఊచకోత జరిగిన వెంటనే ఆశిష్ మిశ్రా తండ్రి, కేంద్ర హెూం శాఖ సహాయ మంత్రి అజరు మిశ్రాను కేబినెట్ నుంచి తొలగించాలని, హత్య, కుట్ర నేరాభియోగాల కింద అతడ్ని అరెస్టు చేయాలని ఎస్‌కెఎం, ఏఐకెఎస్ డిమాండ్ చేసినా పట్టించుకోలేదన్నారు. ఈ భయంకరమైన హత్యాకాండ జరిగి నాలుగు నెలలైనా ప్రధానమంత్రి నరేంద్ర మోడీ, హెూం మంత్రి అమిత్ షా రాజకీయ నైతిక విలువలను గాలికొదిలేసి హంతకుడు, కుట్రదారు అజరు మిశ్రాని మంత్రిగా కొనసాగిస్తున్నారు. ఇప్పుడు ఆశిష్ మిశ్రాకి బెయిలు కూడా ఇచ్చారని అన్నారు. ఎన్నికలు జరుగుతున్న ఉత్తరప్రదేశ్, ఉత్తరాఖండ్, పంజాబ్, గోవా, మణిపూర్‌లో రైతులు, ప్రజలు ఈ మతతత్వ, కార్పొరేట్ బిజెపిని ఓడించేందుకు కంకణధారులు కావాలని ఏఐకెఎస్ నేత పిలుపునిచ్చారు.





# గులాబీ యాపిల్ తోటల పెంపకం



సంగిరెడ్డి హనుమంత రెడ్డి
సెల్ : 94 90 20 45 45

గులాబి యాపిల్ చాలా ఆసక్తికరమైన చెట్లలో ఒకటి. నిజానికి ఇది యాపిల్ చెట్టు కాదు. పండ్లు కాసే సిజిజియం వృక్ష కుటుంబంలోని చాలా చెట్లకు ఈ పేరు పెడతారు. యాపిల్‌ను పోలిన ఏ పండునయినా ఐరోపాలో ఏదో ఒక యాపిల్ పేరుతో పిలుస్తారు. దీన్ని వాటర్ యాపిల్, జమైకన్ యాపిల్, వ్యాక్స్ జంబు, బెల్ యాపిల్ అని అనేక పేర్లతో పిలుస్తున్నారు. ఇవి నాలుగు రకాల జాతులలో లభిస్తాయి. 1. ఎక్కువ నీటి శాతం కల గులాబి యాపిల్, 2. సాధారణ గులాబి యాపిల్, 3. మలయ్ గులాబి యాపిల్, 4. జావా గులాబి యాపిల్.

**గులాబి యాపిల్ చరిత్ర :** గులాబి యాపిల్ నైరుతి ఆసియా ఖండ దేశాలకు చెందిన చెట్టు. అయితే మలేసియా, ఇండొనేషియా దేశాలలో, భారత ఉపఖండంలో స్థిరపడింది. 1852లో దీనిని దక్షిణ అమెరికా దేశం బ్రెజిల్ నుండి పశ్చిమ అమెరికా రాష్ట్రం హవాయికి తెచ్చారు. 1877వ సంవత్సరానికి ముందే దీని ఉనికి అమెరికా నైరుతి దిశలోని చివరి రాష్ట్రం ఫ్లోరిడాలో కనిపించింది. ఉత్తర అమెరికాలో చాలా ప్రాంతాలలో గులాబి యాపిల్ చెట్లను ఇతర తోటలలో అలంకరణ కోసం పెంచుతారు. ఈ అలంకరణ గులాబి యాపిల్ చెట్లు పొట్టిగా పొదలలాగా పెరుగుతాయి. పండ్లు కాయవు.

**గులాబి యాపిల్ చెట్ల లక్షణాలు :** సాధారణంగా గులాబి యాపిల్ చెట్లు 20 నుండి 40 అడుగుల ఎత్తు పెరుగుతాయి. అంతే విస్తీర్ణంలో చెట్టు చుట్టూ గుబురుగా వ్యాపిస్తాయి. ఈ చెట్ల బెరడు లేత గోధుమ రంగులో ఉంటుంది. ఆకులు 4 నుండి 8 అంగుళాల పొడవు, 1, 2 అంగుళాల వెడల్పు ఉంటాయి. పువ్వులు 2 నుంచి 4అంగుళాల పరిమాణంలో వందల సంఖ్యలో తెల్లని కేసరాలతో ఉంటాయి. పండ్లు గంట ఆకారంలో, జామ పండ్ల లాగా ఒకటి నుంచి రెండు అంగుళాల పరిమాణంలో ఉంటాయి. పరాన్నబుక్కులైన చాలా రకాల పురుగులు, కీటకాలు గులాబి యాపిల్ పండ్లను నిలయాలుగా చేసుకొని బతుకుతాయి. ఈ పండ్లు ఎరుపు, పసుపుపచ్చ, ఆకుపచ్చ, తెలుపు రంగులలో ఉంటాయి. పేరులో ఉన్నట్లు గులాబి రంగులోనూ వుండవు. యాపిల్ ఆకారంలోనూ ఉండవు. రుచి, వాసన నిర్మాణంలో యాపిల్, జామ పండ్లకు భిన్నంగా తియ్యగా, కొంచెం చేదు వాసనతో కరకరలాడుతూ రుచికరంగా ఉంటాయి. ఒక పండులో ఒక సెంటి మీటరు వ్యాసంతో ఒకటి రెండు విత్తనాలు ఉంటాయి. ఇవి ఎలాంటి కవచం లేకుండా, వదులుగా, పండు మధ్యలో ఒక తొర్రలో ఉంటాయి.

**గులాబి యాపిల్ చెట్ల పెంపకం :** గులాబి యాపిల్ పూర్తి ఎండలో పెరిగే చెట్టు. రోజుకు కనీసం 6 నుండి 8 గంటల ఎండ ఉండాలి. అందువలన పెద్ద చెట్లు, భవనాల నీడన ఈ చెట్లను పెంచకూడదు. గులాబి యాపిల్ చెట్లకు ఒక మోస్తరు వర్షాలు ఉండాలి. బాగా బెట్ట ప్రదేశాలలో సరిగ్గా పెరగవు. మంచు ప్రాంతాలలో అసలు పెరగవు. ఎక్కువ వర్షపాతంగల ప్రాంతాలలో బాగా పెరుగుతాయి. ఈ చెట్లు సముద్ర మట్టానికి 4,400 అడుగుల ఎత్తు ప్రాంతాలలో కాలువలు, నదుల తీరాల వెంబడి బాగా పెరుగుతాయి. సగం బెట్ట (అర్ధ-శుష్క) ప్రాంతాలలో కూడా పెరుగుతాయి. బంక మట్టి భూములు ఈ చెట్లకు అనుకూలమయినవి. పూర్తి ఎండలో, మధ్యస్థాయి నీటితో పెరుగుతాయి. పూర్తిగా పెరిగిన గులాబి యాపిల్ చెట్లు 25 డిగ్రీల ఫారిన్ హీట్ (-0.4 డిగ్రీల సెల్సియస్) ఉష్ణోగ్రతను తట్టుకొంటాయి. ఈ చెట్లు ఉత్తర అమెరికా వాతావరణంలో బాగా పెరుగుతాయి. గులాబి యాపిల్ చెట్ల



ఈగలతో గులాబి పూల పరాగం

పెంపకం సాధారణంగా విత్తనాల ద్వారా జరుగుతుంది. విత్తనాలు తొందరగా మొలకెత్తుతాయి. విత్తనం పగిలి మధ్య భాగం నుండి వేర్లు, కాండ భాగం బయటికి వస్తాయి. గులాబి యాపిల్ విత్తనాలు బహుళ పిండాల విత్తనాలు. అనగా ఒక విత్తనం నుండి చాలా మొక్కలు పుడతాయి. చిన్న మొలకలుగా ఉన్నపుడే వీటిని వేరుచేసి విడివిడిగా నాటుకోవాలి. ఒక అడుగు పొడవు, ఒక అడుగువెడల్పు, ఒక అడుగు లోతు గుంటలు తవ్వాలి. ఈ గుంటలను సారవంతమైన మట్టి, వేపచెక్క, పశువుల ఎరువుల మిశ్రమంతో నింపాలి. ఈ గుంటలలో గులాబి యాపిల్ విత్తనాలు నాటాలి. నెలపాటు క్రమం తప్పక నీళ్ళు పోయాలి. మూడు నెలల తర్వాత ఈ మొక్కలను తీసి తోటలలో తయారుచేసి ఉంచుకున్న పెద్ద గుంటలలో నాటుకోవాలి. తోటలలో మొక్కలు నాటే ముందు భూమిని దున్ని చదునుచేసి పెట్టుకోవాలి. ఒక మీటరు పొడవు, ఒక మీటరు వెడల్పు, ఒక మీటరు లోతుతో గుంటలు తీసి ఉంచుకోవాలి. గుంట గుంటకు మధ్య నలువైపులా 5, 6 మీటర్ల దూరం ఉండాలి. ఈ గుంటలను 75 శాతం మట్టి, 25 శాతం కుళ్లిన లేదా కంపోస్టు ఎరువు మిశ్రమంతో నింపాలి. ఈ గుంటలలో విత్తనాలు లేదా మొక్కలు నాటాలి. సాధారణంగా ఈ చెట్లకు ఎరువు అవసరం లేదు. సారవంతమయిన భూములలో చెట్లు ఏపుగా, గుబురుగా పెరిగే అవకాశం ఉంది. ఇలా బలంగా పెరిగిన చెట్లు ఆలస్యంగా కాపుకు వస్తాయి. ఈ స్థితిలో చెట్లకు నీళ్ళు కట్టడం మానాలి. సెప్టెంబరు-అక్టోబరు నెలలలో, మరలా ఫిబ్రవరి-మార్చి నెలలలో మాత్రమే నీరు పారకట్టాలి. అప్పటికి కూడా చెట్ల అతి పెరుగుదల ఆగకపోతే, చెట్లు కాపుకు రాకపోతే చెట్ల వేర్లను, కొమ్మలను కత్తిరించాలి. సాధారణంగా మొక్కల దశలో ఏడాదికి 8, 10 సార్లు నీరు పారకట్టాలి. చెట్లు పెరిగే కొద్దీ నీటి పారుదల సగానికి తగ్గించాలి. శరదృతువులో, చలికాలంలో నేల ఎండినపుడు మాత్రమే నీళ్ళు పారకట్టాలి. కాయలు పండే కాలం మే-జూన్ నెలలలో తప్పక నీరు కట్టాలి. గులాబి యాపిల్ తోటలకు బిందు సేద్యం పద్ధతిలో నీళ్ళు పెట్టవచ్చు. పశువుల పేడ, మూత్రం, గడ్డి, చెత్త, ఇతర వ్యవసాయ వ్యర్థాలతో కుళ్లిన ఎరువును ప్రతి చెట్టుకు కాపునకు ముందు 20 కిలోలు, కాపు కాస్తున్నపుడు 50 కిలోలు ఏడాదికి ఒకసారి వేస్తే మంచిది. విత్తనాలతో పెంచిన చెట్లు 5, 6 సంవత్సరాలకు, మొక్కలతో పెంచిన చెట్లు 4, 5 సంవత్సరాలకు కాపుకు వస్తాయి. గులాబి యాపిల్ పూల కేసరాలు తేనె తాగే కీటకాలను ఆకర్షిస్తాయి. ఋతువుల ప్రకారమే గులాబి యాపిల్ చెట్లు పూలు పూస్తాయి. కాయలు కాస్తాయి. సాధారణంగా మధ్య వేసవిలో పూలు పూస్తాయి. 3, 4 నెలలలో కాయలుగా మారతాయి. ఈ చెట్లు 30, 35 సంవత్సరాలపాటు కాయలు కాస్తాయి. గులాబి యాపిల్ తోటలలో అంతర పంటలుగా కొర్ర, రాగి వంటి పంటలను పండించవచ్చు. ఈ చెట్లను జామ చెట్ల లాగా ఇంటి పెరళ్ళలో కూడా పెంచుకోవచ్చు. దీని కోసం గులాబి యాపిల్ కొమ్మలను కత్తిరించి నాటవచ్చు. కుండీలలో పెంచుకోవడానికి అనుకూలంగా మరుగుజ్జు (బోన్సాయి) రకం గులాబి యాపిల్ మొక్కలు కూడా అందుబాటులో ఉన్నాయి.

బూజు, ఆకు మచ్చలు, వేర్లు కుళ్లడం గులాబి యాపిల్ చెట్లకు సోకే సాధారణ రోగాలు. ఈ చెట్లు పురుగులు, కీటకాలను నిరోధిస్తాయి. పురుగుల కంటే బూజు ఎక్కువ హాని కలిగిస్తుంది. ఎప్పటికప్పుడు ఈ రోగాలను జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి. నిరోధక నివారణ చర్యలు చేపట్టాలి. పండ్ల ఉత్పత్తిని, నాణ్యతను పెంచడానికి, రోగాలను అరికట్టడానికి గులాబి యాపిల్ చెట్లను కత్తిరిస్తారు. కత్తిరించిన చెట్లకు గాలి, ఎండ బాగా అందుతాయి. సూర్యరశ్మితో చెట్లు బాగా పూత పూస్తాయి. ధారాళంగా వీచే గాలి రోగాలను దరిచేరనీయదు. కత్తిరించే పనిముట్లను (కత్తెరలను) కత్తిరించే ముందు సబ్బునీళ్ళతో కడగాలి. ఇది రోగాల వ్యాప్తిని అరికడుతుంది. కత్తిరించిన తర్వాత పనిముట్లకు నూనె రాయాలి. ఇది కత్తెరల పదునును కాపాడుతుంది. కాని గులాబి యాపిల్ చెట్లను క్రమం తప్పకుండా కత్తిరించవలసిన అవసరం లేదు. ఎండిన కొమ్మలను, అడ్డదిడ్డంగా పెరిగిన కొమ్మలను మాత్రం కత్తిరించి తొలగించాలి. నేల మట్టానికి 60 నుండి 100 సెంటి మీటర్ల ఎత్తులో కొమ్మలు ఉండేటట్లు చూడాలి. గులాబి యాపిల్ స్వయం ఫలదీకరణ వృక్షం. అంటే దీనికి పరాగ సంపర్కం అవసరం లేదు. అయితే పరాగ సంపర్కం ఉంటే బాగా కాస్తుంది. విత్తనాలతో పెంచిన చెట్లు 3-5 ఏళ్ళకు, మొక్కలతో పెంచిన చెట్లు 2 ఏళ్ళకు కాపుకు వస్తాయి. కాయను ఊపినపుడు విత్తనాలు గలగల లాడితే కాయ పండినట్లు లెక్క. పండ్లు తొందరగా చెడిపోతాయి. అందువలన పండగానే ఆలస్యం చేయకుండా పండ్లను కోయాలి. పండ్లను చేతితో కోయడం మంచిది. కోసిన తర్వాత ఒక రోజు లోపలే వాడాలి. లేకుంటే బట్టలో చుట్టి రెఫ్రిజిరేటర్‌లో వుంచాలి. ఒక కాపుకు గులాబి యాపిల్ పండ్ల సగటు దిగుబడి విత్తనాలతో పెంచిన చెట్ల నుండి 3-5 కిలోలు, మొక్కలతో పెంచిన చెట్ల నుండి 6-8 కిలోలు ఉంటుంది. జూను, సెప్టెంబరు నెలలలో ఏడాదికి రెండు కాపులు కాస్తాయి. కర్ణాటక కోలార్ దగ్గర బరగూరు రైతు తోటలో చెట్టుకు, కాపునకు 30 కిలోల పండ్లు కాశాయి. మేలు రకం గులాబి యాపిల్ పండ్ల ధర కిలో రూ. 700 ఉంటుంది. కిలో వాటరు యాపిల్ ధర రూ. 300. మన దేశంలో స్థానిక మండీలలో గులాబి యాపిల్ పండ్ల ధర కిలో రూ. 500, రూ. 400 ఉంటున్నది. ఈ పండ్లను అమెరికాలో ఎక్కువగా వాడుతారు. కాని అమెరికా స్థానిక మార్కెట్లలో ఇవి తక్కువగా దొరుకుతాయి.



ఆకుపచ్చ జంబు గులాబి యాపిల్



తెల్ల వాటర్ గులాబి యాపిల్



గులాబి యాపిల్ విత్తనాలు

అమెరికాలో పండిన పండ్లు తోటల దగ్గరే పూర్తిగా అమ్ముడు పోతున్నాయి. అమెరికాలో గులాబి యాపిల్ పండ్లకు మంచి డిమాండు ఉంది. బెంగుళూరు మార్కెట్ లో ఈ పండ్లకు మంచి గిరాకీ ఉంది. తోటలు పెంచటానికి గులాబి యాపిల్ మొక్కలు దొరుకుతాయి. వివిధ కంపెనీల గులాబి యాపిల్ మొక్కలు రూ. 200, రూ. 300, రూ. 400 కు అమెజాన్ ద్వారా దొరుకుతాయి. బెంగుళూరు హెసరఘట్టలోని ప్రభుత్వ హార్టికల్చర్ ఫార్మ్ అతి తక్కువ ధరకు గులాబి యాపిల్ మొక్కలను సరఫరా చేస్తుంది.

**గులాబి యాపిల్ చెట్ల, పండ్ల ప్రయోజనాలు :** గులాబి యాపిల్ పండ్లలో పోషక పదార్థాలు, నత్రజని మిశ్రమాలు, పీచు పదార్థాలు, సున్నం, ఇనుము, ఎ, సి, విటమిన్లు ఉంటాయి. ఈ చెట్ల బెరడులో ఔషధ గుణాలుకల జాంబొసిన్ అనే పదార్థం ఉంది. ఇందులో మధుమేహాన్ని నయం చేసే ఔషధ గుణం ఉంది. మానవ ఆరోగ్యాన్ని పెంపొందించే అనేక జీవ పదార్థాలు ఉన్నాయి. వీటి కండ గులాబి పూల రేకులను పోలిన తియ్యటి రుచి కలిగి ఉంటుంది. అందుకే వీటిని గులాబి యాపిల్ అంటారు. వీటిని పండ్లుగా తింటారు. అనేక రకాల వంటకాలు, సాలాడ్స్, డిజర్ట్స్ చేసుకుంటారు. దీని కొయ్యతో అనేక చెక్క పనిముట్లు తయారు చేస్తారు.

గులాబి యాపిల్ పండ్లు నిమ్మ సువాసనతో రుచిగా తియ్యగా వుంటాయి. ఇవి పుచ్చకాయలలాగా కండతో నీటి శాతం ఎక్కువగా కలిగి ఉంటాయి. వీటితో అనేక రకాల రసాలు తయారు చేసుకోవచ్చు. ఈ పండ్లను కోసిన తర్వాత తొందరగానే తినాలి. ఈ పండ్ల విత్తనాలు చేదుగా ఉంటాయి. మత్తు కలిగిస్తాయి. అందుకే పండ్లు కోసిన వెంటనే పండ్ల నుంచి విత్తనాలను వేరుచేయాలి. ఈ పండ్లను ఎండబెట్టి ముక్కలతో వడియాలు (చిప్స్) చేసుకోవచ్చు. ఈ పండ్ల ముక్కలతో చంబక్క సాధం అని పేరు పొందిన అన్నం తయారు చేయవచ్చు. చంబక్క జామ్ కూడా బాగా ప్రసిద్ధిగాంచిన సంప్రదాయ వంటకం. ఈ పండ్లతో ఊరగాయలు, చారు, పులుసు, జెల్లీలు, సూప్, మద్యం కూడా తయారు చేస్తారు. బెల్లం, పంచదార వాడకుండానే ఈ పండ్లతో తీపి పదార్థాలు తయారు చేయవచ్చు. వీటిలో పలు రకాల పోషక పదార్థాలు, ఖనిజాలు, పీచు పదార్థాలు ఉంటాయి. ఇది తక్కువ మోతాదులో కొలెస్ట్రాల్, సోడియంలు కలిగిన ఆరోగ్యకరమైన పండు. రోగ నిరోధక శక్తిని పెంచుతుంది. అంటు రోగాలను దరికి చేరనీయదు. జీర్ణకోశ వ్యాధులను నయం చేస్తుంది. మలబద్ధకం, ఊబకాయం, కడుపు ఉబ్బరాలను తగ్గిస్తుంది. దీని విత్తనాలు విరేచనాలను ఆపుతాయి. ఈ పండ్ల డికాక్షన్, కాలేయం, రసాలు మూత్రపిండాలను శుభ్రపరుస్తాయి. సూక్ష్మజీవులు (బ్యాక్టీరియా), బూజు (ఫంగస్)వంటి క్రిములతో సంక్రమించే రోగాల నుండి కాపాడుతుంది. చర్మం, పళ్ళు, కళ్ళు ఆరోగ్యంగా ఉండేటట్లు చేస్తుంది. గుండె, నరాల ఆరోగ్యాలను మెరుగుపరుస్తుంది. గుండెపోటు, రక్త పోటు, పక్షవాతం రాకుండా చేస్తుంది. కణితి, రాచపుండు (క్యాన్సర్) కణాల పెరుగుదలను అరికడుతుంది. ఫలితంగా అనేక రకాల క్యాన్సర్లు, కణితి రాకుండా చేస్తుంది. గులాబి యాపిల్ గర్భవతులకు మంచిది. దాని విత్తనాలు, ఆకులు జ్వరం, ఆస్తమా చికిత్సలలో పనిచేస్తాయి. మెదడు ఆరోగ్యాన్ని మెరుగుపరిచి, చురుకుదనాన్ని, తెలివితేటలను, ఆలోచనాశక్తిని పెంచుతాయి. మూర్ఛరోగం, మశూచి, కీళ్ల వాపులకు ప్రభావవంతంగా పనిచేస్తుంది. గులాబి యాపిల్ పండ్లను అధికంగా తింటే గొంతులో దురద, దగ్గు వచ్చే అవకాశం ఉంది. అందువలన ఈ పండ్లను పరిమితంగా, ఆకులు, విత్తనాలను అతి పరిమితంగా తినడం మంచిది.

**భారత్‌లో గులాబి యాపిల్ తోటల సాగు :** మన దేశంలో గులాబి యాపిల్ క్రీ.పూ. 500 సంవత్సరాల నుండి సాగులో ఉన్నదని చరిత్ర తెలుపుతున్నది. ప్రస్తుతం చాలా ప్రాంతాలలో గులాబి యాపిల్ తోటలను పెంచుతున్నారు. దక్షిణ భారత రాష్ట్రాలలో, పశ్చిమ కోస్తా ప్రాంతాలలో, ఈశాన్య రాష్ట్రాలలో వీటిని ఎక్కువగా పెంచు తున్నారు. అస్సాం, మణిపూర్, మేఘాలయ, త్రిపుర, కేరళ, కర్ణాటక, పశ్చిమ బెంగాల్, ఆంధ్ర ప్రదేశ్‌లలో తక్కువగా ఈ తోటలను పెంచుతున్నారు. తమిళ నాడు తిరుచిరాపల్లిలో గులాబి యాపిల్ తోటలను పెంచుతున్నారు. కర్ణాటక కోలార్ దగ్గర బరగూర్‌లో మంజునాథరెడ్డి అనే రైతు 16 ఏళ్ల క్రితమే గులాబి యాపిల్ తోటలను పెంచారు. ఆ తోటలలో అంతర పంటలతో తన వ్యవసాయ ఆదాయాలను పెంచుకున్నారు.

**ముగింపు :** సంప్రదాయ పంటలతో రైతులు బతకటం కష్టంగా వుంది. ఈ నేపథ్యంలో ప్రత్యామ్నాయ వ్యవసాయ ఆదాయ వనరుగా, అంతర పంటలతో, గులాబి యాపిల్ తోటలను పెంచవచ్చును. ఇందుకు రాష్ట్ర ప్రభుత్వం నుండి రాయితీలు కోరవచ్చు.

(వ్యాసకర్త : ఆల్ ఇండియా
ప్రోగ్రెసివ్ ఫోరం జాతీయ కార్యదర్శి)



# తేనెటీగల పెంపకం

**తేనెటీగల పెంపకం వ్యవసాయాధార పరిశ్రమ. రైతులు అదనపు ఆదాయం కోసం తేనెటీగల పెంపకాన్ని చేపట్టవచ్చు. తేనెటీగలు పువ్వులలో మకరందాన్ని తేనెగా మార్చి, తేనెపట్టు అరలలో నిల్వ చేసుకుంటాయి. అడవుల నుంచి తేనె సేకరించడమనేది ఎప్పటి నుంచో వున్నదే. తేనెకు దాని ఉత్పత్తులకు మార్కెట్లో గిరాకీ పెరుగుతుండడంతో, తేనెటీగల పెంపకం లాభసాటి పరిశ్రమగా మారింది. తేనెటీగల పెంపకం నుంచి లభించే విలువైన ఉత్పత్తులలో తేనె, మైనము ముఖ్యమైనవి.**


**యం. లక్ష్మీ నాగ నందిని,**
**వై. శ్రావణి, కోమలి జోసఫ్. జి.**
పి. హెచ్. డి. స్కాలర్స్,
డా. వై. యస్. ఆర్. ఉద్యాన విశ్వ విద్యాలయం,
వెంకటరామన్నగూడెం, పశ్చిమ గోదావరి జిల్లా,
ఆంధ్రప్రదేశ్ - 534101
ఫోన్ నెంబర్: 7093492058


**ఆదాయమార్గంగా తేనెటీగల పెంపకం - ప్రయోజనాలు :**

- తేనెటీగల పెంపకానికి కొద్దిపాటి పెట్టుబడి, వనరులు, సమయం చాలు.
- తేనెటీగల పెంపకానికి, మైనం తయారీకి వ్యవసాయపరంగా ఎలాంటి విలువలేని స్థలమైన చాలు.
- మరి ఏ ఇతర వ్యవసాయ పరిశ్రమ కన్నా కూడా, తేనెటీగల పెంపకానికి అతి కొద్దిపాటి వనరులు సరిపోతాయి.
- తేనెటీగల పెంపకం పర్యావరణం పై సానుకూల ప్రభావం చూపుతుంది. పూలుపూచే మొక్కలలో పరాగ సంపర్కానికి తేనెటీగలు ఎంతగానో తోడ్పడతాయి. ఆ విధంగా, ప్రొద్దుతిరుగుడు వంటి పంటలలో, వివిధ పండ్ల జాతులలో అధిక దిగుబడికి తేనెటీగల పెంపకం దొహదం చేస్తుంది.
- తేనె చాల రుచికరమైన, అధిక పోషక విలువలు కలిగిన ఆహార పదార్థం, తేనె పట్టుకోసం అడవులలో తేనెటీగలను వేటాడడం పాత పద్ధతి, ఈ పద్ధతిలోఎన్నెన్నో తేనెటీగల సమూహాలు నాశనమైపోయేవి. ఇళ్ళ వద్దనే పెట్టెలలో తేనెటీగలను పెంచి, తేనెను సేకరించడం వల్ల తేనెటీగల వినాశనాన్ని నివారించవచ్చు.
- తేనెటీగల పెంపకాన్ని ఎవరికి వారుగాకాని, బృందాలుగాకాని చేపట్టవచ్చు.
- తేనెకు, మైనానికి మార్కెట్లో ఎంతో గిరాకీ వుంది.

**తయారీవిధానం :**

తేనెటీగలను పొలంలో లేదా ఇంటివద్ద పెట్టెలలో పెంచవచ్చు.

**తేనెటీగల పెంపకానికి కావలసిన పరికరాలు :**

- తేనెపెట్టె (హైవ్) ఇది పొడవుగావుండే ఒక చెక్క పెట్టె. దీని పై భాగం నుంచి కింది వరకు పొడవైన అనేక పెట్టెలు వుంటాయి. ఈ పెట్టె కొలతలు సుమారుగా ఇలా వుంటాయి. పొడవు 100 సెంటీ మీటర్లు, వెడల్పు 45 సెంటీ మీటర్లు, ఎత్తు 25 సెంటీ మీటర్లు, మందం 2 సెంటీ మీటర్లు, తేనే టీగలు రావడానికి, పోవడానికి వీలుగా ఈ పెట్టెకు ఒక్కొక్కటి ఒక సెంటీ మీటరు వెడల్పు కలిగిన రంధ్రాలు వుంటాయి. పెట్టెకు పైన పట్టెల బిగింపు ఈ రంధ్రాలు మూసుకుపోని విధంగా వుండాలి. పట్టెలు పెట్టె కింది వరకు వుండాలి. ఎక్కువగా తేనెటీగలు పట్టితే, ఆ బరువును తట్టుకునే విధంగా పట్టెలు 1.5 సెంటీ మీటర్ల మందంతో వుండాలి. పెట్టెలో తేనెటీగలు తిరగడానికి ఇరుకుగా వుండకుండా, పెట్టెకు పెట్టెకు మధ్య కనీసం 3.3 సెంటీ మీటర్ల ఎడం వుండాలి.
- పొగ డబ్బా (స్మోకర్) ఇది ముఖ్యమైన రెండవ పరికరం. ఒక చిన్న డబ్బాను ఇందుకు ఉపయోగించవచ్చు. తేనెటీగలు మనలను కుట్టకుండా చూసుకోవడానికి, వాటిని అదుపుచేయడానికి డబ్బా ఉపయోగపడుతుంది.
- గుడ్డ ముక్క - తేనే పట్టుకు దగ్గరగా పనిచేస్తున్నపుడు తేనెటీగలు కుట్టకుండా కళ్ళను ముక్కును కప్పుకోవడానికి.

* చాకు - తేనె పట్టె పై పట్టెలను కదిలించి, తేనే అరలను కత్తిరించడానికి.
* ఈక - తేనె అర నుంచి తేనెటీగలను నెట్టివేయడానికి.
* రాణి ఈగను వేరుపరచు జిల్లెడ (క్వీన్ ఎక్స్బ్రూడర్)
* అగ్గి పెట్టె

**తేనె టీగల జాతులు :**

ఇండియాలో నాలుగు జాతుల తేనెటీగలు వున్నాయి. అవి

* రాక్ బీ (ఎపిస్ డార్సటా) ఇవి చాలా ఎక్కువ తేనే సేకరిస్తాయి. సగటున ఒక్కొక్క తేనె పట్టుకు 50 -80 కిలోల తేనెను ఇవి సేకరిస్తాయి.
* లిటిల్ బీ (ఎపిస్ ఫ్లోరియా) ఇవి బాగా తక్కువగా తేనెను సేకరిస్తాయి. ఒక్కొక్క పట్టుకు కేవలం 200 -900 గ్రాముల తేనె మాత్రమే వస్తుంది.
* ఇండియన్ బీ (ఎపిస్ సెరనా ఇండికా) ఇవి ఏడాదికి సగటున 6-8 కిలోల తేనెను సేకరిస్తాయి.
* యూరోపియన్ బీ (ఇటాలియన్ బీస్) (ఎపిసమెల్లిఫెరా) ఒక్కొక్క తేనె పట్టుకు సగటున 25-40 కిలోల తేనే వస్తుంది.
* కొండి లేని తేనెటీగ (ట్రిగొనా ఇరిడిపెన్నిస్) పైన పేర్కొన్న నాలుగు జాతులే కాకుండా కేరళలో కొండిలేని తేనెటీగ అనే మరో జాతి కూడా వుంది. అయితే నిజానికి వాటికి కొండి బొత్తిగా లేకపోలేదు కాని అది అంతగా పెరగదు. ఇవి పరాగ సంపర్కానికి బాగా తోడ్పడతాయి. సంవత్సరానికి 300 %--% 400 గ్రాములు తేనెను సేకరించగలవు.

**తేనె పెట్టెల ఏర్పాటు :**

* తేనె పెట్టెలను తప్పని సరిగా, నీరు నిల్వన ప్రదేశంలో ఏర్పాటు చెయ్యాలి. మకరందం, పుప్పొడి, నీరు బాగా లభ్యమయ్యే పండ్ల తోటల సమీపంలో అయితే మరీ మంచిది.
* తేనె పెట్టెలో ఎప్పుడూ అనువైన ఉష్ణోగ్రత వుండాలి. అందువల్ల, తేనె పెట్టెకు నేరుగా ఎండ తగలకుండా చూడాలి.
* చీమలు పట్టకుండా, తేనె పెట్టె స్టాండు కాళ్లకింద నీటిగిన్నెలు అమర్చాలి. వాన ఎండల నుంచి రక్షణకోసం తేనెటీగల పట్టెలను తూర్పు దిశకు అమర్చాలి. తేనె పెట్టె పెట్టె వుండే దిక్కుకు కొద్ది తేడాతో అమరిక వుండాలి.
* తేనెటీగల అరలను పశువులకు, జంతువులకు అందుబాటులో వుండకుండా చూడాలి. జన సమ్మర్ధమైన రోడ్లపక్కన, వీధి దీపాల దగ్గర వీటిని వుంచకూడదు.

**తేనె టీగల సముదాయాన్ని ఏర్పాటుచేయడం :**

* అడవిలో తేనెటీగల గుడ్లు వున్న తేనెతుట్టనుతెచ్చి, తేనెపెట్టెలో పెట్టడం ద్వారానో తేనెపట్టె సమీపం నుంచి వెళ్ళే తేనెటీగల గుంపును తేనెపెట్టెలోకి ఆకర్షించడం ద్వారానో తేనెటీగల సముదాయాన్ని ఏర్పాటు చేయవచ్చు.
* తేనెటీగల గుడ్లునో, అటుగా వెళ్ళే తేనెటీగల గుంపునో ఆకర్షించడానికి ముందుగా చేయవలసింది ఆ తేనెపెట్టెలో తేనెటీగలకు అలవాటైన వాసన వుండేలా చూడడం. కొన్ని పాత తేనెతుట్టె ముక్కలనో, కొద్దిపాటి తేనె మైనాన్నో తీసుకుని ఈ కొత్త తేనె పెట్టెకు బాగా రుద్దాలి. వీలైతే, గుంపుగా వెళ్ళే తేనెటీగల నుంచి రాణి ఈగను పట్టుకుని, తేనె పెట్టెలో అడుగున వుంచాలి. అప్పుడు ఇతర తేనెటీగలు అక్కడికి ఆకర్షితమవుతాయి.



* అరకప్పు వేడి నీటిలో, అరకప్పు చక్కెర కలిపిన ద్రావణాన్ని, తేనె పెట్టెలోకి చేరిన ఈ తేనెటీగల సముదాయానికి కొన్ని వారాల పాటు ఆహారంగా అందించాలి. తేనెటీగలు పట్టెల వెంబడి తేనే అరల నేర్పరచడాన్ని కూడా ఇది త్వరితం చేస్తుంది.
* ఒక తేనె పెట్టెలో మరీ ఎక్కువ సంఖ్యలో తేనెటీగలు వుండకుండా జాగ్రత్త వహించాలి.

**తేనె పెట్టె నిర్వహణ :**

* తేనె పట్టులో తేనె నిండే రోజులలో కనీసం వారానికొకసారి తేనె పెట్టెలను పరిశీలించాలి. ఉదయం పూట అయితే మరీ మంచిది.
* ఈ వరసలో తేనె పెట్టెను శుభ్రం చేయాలి. పై భాగం, సూపర్ / సూపర్స్ ఛేంబర్, పిల్ల ఈగలు అరలు (బ్రూడ్ ఛేంబర్స్), అడుగు పలక (ఫ్లోర్ బోర్డు)
* రాణి ఈగ బాగున్నదీ లేనిదీ, పిల్ల ఈగల పెరుగుదల ఎలా వున్నదీ, తేనె పుప్పొడి ఏ మేరకు పోగైందీ,
* రాణి ఈగ వుండే అరలు ఎలా వున్నదీ, తేనెటీగలు ఏ సంఖ్యలో వున్నదీ ఎప్పటికప్పుడు గమనిస్తుండాలి.
* తేనెటీగలకు హానికలిగించే ఈ క్రింది క్రిమికీటకాలు తేనె పెట్టెలో చేరాయేమో గమనిస్తుండాలి. మైనపు పురుగు (వాక్స్ మాత్) (గల్లేరియా మెల్లోనెల్లా) తేనె పెట్టె అరల నుంచి, పెట్టె మూలల నుంచి గుడ్లను, కోశాలను తొలగించాలి. మైనపు పెంకు పురుగు (వాక్స్ బీటిల్స్ ) (ప్లాటీ బోలియం) పురుగులనన్నీటిని ఏరిపారేయాలి. పెద్దవాటిని చంపేయాలి మైట్స్ పెట్టె ఫ్రేమ్ ను, కింది పలకను తాజాగా తయారు చేసిన పొటాషియం పెర్మాంగనేట్ ద్రావణంలో ముంచిన దూది లేదా నూలుగుడ్డ పీలికలతో బాగా తుడవాలి. కింది పలక మీద మైట్స్ అన్నీ పూర్తిగాపోయే వరకు ఇలా పదే పదే తుడవాలి.

❖ తేనె సేకరణ తక్కువగా వుండే సీజన్లో నిర్వహణ సూపర్స్ ను తొలగించి, పిల్ల ఈగల అరలో ఆరోగ్యవంతమైన పిల్ల ఈగలను దగ్గరదగ్గరగా వుంచాలి. అవసరమైతే అరను విడదీసే డివిజన్ బోర్డు ఉపయోగించాలి.

❖ రాణి ఈగ సెల్స్, పోతుటీగ సెల్స్ కనిపిస్తే వాటిని నాశనం చేయాలి ఒక్కొక్క తేనె పట్టుకు వారానికి 200 గ్రాముల చక్కెరను సమానపరిమాణపు నీటిలో కలిపి తయారు చేసిన ద్రావణాన్ని అందుబాటులో వుంచాలి. తేనె పెట్టెలోని అన్ని తేనె పట్టులకు ఆహారం అందుబాటులో వుంచాలి.

❖ తేనె సేకరణ ఎక్కువగా వుండే కాలంలో నిర్వహణ తేనె సేకరణ ఎక్కువగా వుండే కాలానికి ముందే తేనె పట్టులో ఈగలు తగిన సంఖ్యలో వుండేలా చూడాలి. మొదటి సూపర్ కు, బ్రూడ్ ఛేంబర్ కు మధ్య వీలున్నంత ఎక్కువ ఖాళీజాగా వుండేలా చూడాలి. అయితే మొదటి సూపర్ పైన ఖాళీజాగా వుంచకూడదు.

❖ రాణి ఈగను పిల్లల (బ్రూడ్) అరకే పరిమితం చేసే విధంగా, బ్రూడ్– సూపర్ ఛేంబర్ల మధ్య రాణిని వేరుపరచు జల్లెడ (క్వీన్ ఎక్స్లూడర్) ను వుంచాలి.

తేనె పట్టును వారానికొకసారి గమనిస్తూ, తేనె నిండుగా వున్న చట్రాలను సూపర్ పక్కగా జరపాలి. మూడువంతులు తేనె, లేదా పుప్పొడితో ఒక వంతు అంటుకుపోయిన పిల్ల ఈగలతో వున్న చట్రాలను బ్రూడ్ ఛేంబర్ నుంచి తీసివేయాలి. వాటి స్థానంలో ఖాళీ పట్టెలను లేదా చట్రాలను వుంచాలి.

పూర్తిగా లేదా మూడింట రెండు వంతులు తేనేతో నిండిన చట్రాలను బయటకు తీసి, తేనె పిండుకున్న తర్వాత తిరిగి సూపర్స్ లో పెట్టాలి.

**తేనె తీయడం :**

❖ పొగపెట్టి ఈగలను పక్కకు మళ్ళించి, తేనె పట్టిన భాగాలను జాగ్రత్తగా కత్తిరించి, తేనెను తీయాలి.

❖ సాధారణంగా పూలు బాగాపూచే అక్టోబరు/ నవంబరు ఫిబ్రవరి / జూన్ సీజన్లలోను, ఆ తర్వాత కొద్దిరోజుల పాటు తేనె తీయడానికి అనువైన కాలం.

❖ బాగా తేనె నిండిన తేనె పట్టె లేత రంగులో వుంటుంది. రెండు వైపుల సగానికి పైగా తేనె గూళ్ళు మైనంతో నిండి వుంటాయి.

గ్రీక్ బాస్కెట్ హైవ్ (బుట్టలో తేనెపట్టు పెంపకం):

గ్రీక్ బాస్కెట్ హైవ్ అనేది సాంప్రదాయికమైన పరిజ్ఞానం. కేవలం, స్థానికంగా లభ్యమయ్యే వస్తువులు, స్థానిక నైపుణ్యాలతో ఈ బుట్టతో తేనెటీగల పెంపకం సాగించ గలుగుతుండడంతో, ఇది ఇప్పటికీ అనువైన విధానమే.

**నిర్మాణం :**

❖ ఈ బుట్ట పైభాగంలో ఎక్కువ వెడల్పుగా కింద తక్కువ వెడల్పుగా వుంటుంది.

❖ పైభాగాన్ని ఒక్కొక్కటి 1.25 అంగుళాల వెడల్పు వుండే, సమాంతరంమైన కొయ్య పలకలతో కప్పుతారు. తేనెటీగలు



బయటకు వెళ్ళలేని మూత మాదిరిగా, వీటిని దగ్గర దగ్గరగా అమర్చుతారు. ఈ కొయ్య పలకలు ఒక అంగుళం మేర లోపలివైపునకు వంపు తిరిగి వుంటాయి. ఈ వంపు పలక మధ్యన కేంద్రీకృతమవుతుంది. పలకల రెండు చివరలూ 2-3 అంగుళాల వరకు సమతలంగా వుండాలి. ఎందుకంటే, బుట్ట అంచుకంటె మందమైన ఈ పలకలు చివరలలో వంపుగావుంటే, ఆ సందులనుంచి తేనెటీగలు తప్పించుకునే అవకాశం వుంటుంది. దానిని నివారించడం కోసమే , ఇలా బుట్ట అంచుపై చక్కగా నిలవడానికి వీలుగా, పలకల చివరలను సమతలంగా వుంచుతారు. **( 1 వ బొమ్మ చూడండి).**

❖ ప్రతి పలక పొడవునా, మధ్యలో కిందుగా ఒక మంచి తేనెతుట్టెను, కరిగించిన తేనె మైనంతో అతికించాలి. తేనెటీగలు ఆ కొయ్యపలక కిందుగా బుట్ట చివరివరకు మంచి తేనెపట్టును పెట్టడానికి ఇది వాటికి దారి చూపుతుందన్నమాట.

❖ ఈ బుట్టకు లోపలివైపు, వెలుపలివైపు రెండుభాగాలు ఆవుపేడ, ఒకభాగం బంకమన్ను కలిపిన మిశ్రమాన్ని పూయాలి. (2వ బొమ్మ చూడండి). ఈ మిశ్రమం పూత ఆరిన తర్వాత పలకలను బుట్ట పైన అమర్చి, గడ్డితో చేసిన కిరీటాకారపు టోపీతో కప్పాలి. ఎండ, వానలనుంచి తేనెటీగల బుట్టను ఇది కాపాడుతుంది. (3వ బొమ్మ చూడండి).

❖ బుట్టలోకి తేనెటీగలు వెళ్ళడానికి ఏర్పాటుచేసే ప్రవేశద్వారం బుట్ట అడుగునుంచి కనీసం మూడు అంగుళాలు ఎత్తులో వుండాలి. ఎందుకంటె, ఒకవేళ ఏదైనా తేనె తుట్టె కిందపడినా, ద్వారం మూసుకుపోకుండా వుండడానికి. (4వ బొమ్మ చూడండి).

❖ తేనె పట్టు తేనెతోనిండి, తేనె తీయడానికి సిద్ధంగా వుంటే, పలకలనుంచి తేనె పట్టులను జాగ్రత్తగా కోయాలి. అయితే, ప్రతి పలకకు పావు అంగుళాన్ని మించకుండా, మంచి తేనెపట్టు ముక్కను మిగిలించి, మిగతా దానిని కోయాలి. ఈ మిగిలిన చిన్న తేనెతుట్టె, తేనెటీగలను ఆకర్షించి, నేరుగా కొత్త తేనె పట్టు పెట్టే మార్గాన్ని సిద్ధంచేస్తుంది. ❋




**కేతావత్ నరేష్**
(పి. హెచ్.డి. రీసెర్చి స్కాలర్),
ఎస్.కె.యు.ఎ.ఎస్.టి. కశ్మీర్

మన రాష్ట్రంలో మినుము 13.8 లక్షల ఎకరాల్లో సాగు జరుగుతోంది. దాదాపు 3.22 లక్షల టన్నుల మినుము ఉత్పత్తి జరుగుతోంది. ఎకరానికి సరాసరి 233 కిలోల దిగుబడి వస్తోంది. రాష్ట్రంలో మినుము తొలకరిలోనూ, రబీలోనూ, వేసవిలో వరికోతల తర్వాతా పండిస్తారు.

**విత్తనం :** తొలకరిలో జూన్ లేక జూలై మాసాలు, రబీ మెట్టలో అక్టోబరులో, రబీ మాగాణిలో నవంబరులో, వేసవి ఆరుతడిలో ఫిబ్రవరిలో, వేసవి మాగాణుల్లో మార్చిలో విత్తుకోవాలి.

**విత్తన మోతాదు :** తొలకరిలో ఎకరానికి 6 కిలోలు, రబీ మెట్టలో ఎకరానికి 6 కిలోలు, రబీ మాగాణిలో ఎకరానికి 16 కిలోలు, వేసవి ఆరుతడిలో ఎకరానికి 10-12 కిలోలు, వేసవి మాగాణిలో ఎకరానికి 16-18 కిలోలను విత్తుకోవాలి

**విత్తనశుద్ధి :** కిలో విత్తనానికి 30 గ్రాముల కార్బోసల్ఫాన్, 2.5 గ్రాముల థైరమ్ లేదా కాకాప్తాన్స్ మందును వాడి విత్తనశుద్ధి చేసుకోవాలి.

**విత్తే దూరం :** తొలకరిలో 30×10 సెంటీమీటర్లు, రబీ మెట్టలో 30×10 సెంటీమీటర్లు, వేసవి ఆరుతడిలో 22.5×10 సెంటీమీటర్ల దూరంలో విత్తుకోవాలి.

**రకాలు :** ఎల్.బి.జి-20 (తేజ), టి.9, ఎల్‌బిజి-623 (లాం623), డబ్ల్యుబిజి-26 (వరంగల్-26), పిబిజి-1

**వరి మాగాణులకు అనువైన రకాలు :** ఎల్‌బిజి -402 (ప్రభవ), ఎల్‌బిజి 611, ఎల్‌బిజి-22, ఎల్‌బిజి - 648, ఎల్‌బిజి - 685, ఎల్‌బిజి - 645, పిబిజి -107, ఎల్‌బిజి - 709.

**ఎరువులు :** భూమిని బాగా దుక్కి దున్ని విత్తడానికి ముందు హెక్టారుకు 20 కిలోల నత్రజని, 50 కిలోల భాస్వరం ఇచ్చే ఎరువులను వేసి గొర్రుతో కలియదున్నాలి. వరి మాగాణుల్లో మినుము సాగు చేసేటప్పుడు ఎరువులు వాడనవసరం లేదు.

**నీటి యాజమాన్యం :** వర్షాభావ పరిస్థితి ఏర్పడినప్పుడు ఒకటి రెండు నీటి తడులు ఇవ్వాలి. వరి మాగాణుల్లో నీటి తడి ఇవ్వొచ్చు. ఒకటి రెండు తేలిక తడులు, 30 రోజులలోపు, 55 రోజుల తర్వాత ఇస్తే అధిక దిగుబడులు సాధించవచ్చు

**కలుపు నివారణ - అంతరకృషి :** మెట్ట మినుములో విత్తడానికి ముందు ఫ్లూక్లోరాలిన్ 45శాతం ద్రావకాన్ని ఎకరానికి ఒక లీటరు చొప్పున భూమిపై పిచికారీ చేసి గుంటకలతో పైపైన కలియదున్నాలి. లేదా పెండిమిథాలిన్ 30 శాతం ద్రావకం ఎకరానికి 1.3 నుండి 1.6 లీటరు చొప్పున విత్తిన వెంటనేగాని, మరుసటి రోజునగాని పిచికారి చేయాలి. మాగాణి మినుములో ఊద, చిప్పెర, గరిక వంటి గడ్డి జాతి మొక్కల నిర్మూలనకు ఫెనాక్సోఫాస్ ఇథైల్ 9 శాతం ద్రావకాన్ని ఎకరానికి 250 మిల్లీలీటర్లు లేదా క్వేజలాసాప్ ఇథైల్ 5 శాతం ద్రావకాన్ని ఎకరానికి 400 మిల్లీలీటర్ల చొప్పున ఏదో ఒకదానిని 200 లీటర్ల నీటిలో కలిపి విత్తిన 20 - 25 రోజులప్పుడు పిచికారి చేసి సమర్థవంతంగా కలుపు నివారించుకోవచ్చు.

## మినుము తెగుళ్లు

**కారినోస్పోరా ఆకుమచ్చ తెగులు :** ఈ తెగులు సోకిన ఆకులపై చిన్నచిన్న గుండ్రని గోధుమరంగు మచ్చులు ఏర్పడి అనుకూల వాతావరణ పరిస్థితుల్లో పెద్ద మచ్చలు వలయాకారంగా ఏర్పడి ఆకులు ఎండి రాలిపోతాయి.



**నివారణ :** లీటరు నీటికి 2.5 గ్రాముల మాంకోజెబ్ లేదా 3 గ్రాముల కాపర్ ఆక్సీక్లోరైడ్‌లను 10 రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి

**సెర్కోస్పోరా ఆకుమచ్చ తెగులు :** ఆకులపై గోధుమరంగు గుండ్రని చిన్నచిన్న మచ్చులు కనిపించి అనుకూల వాతావరణ పరిస్థితుల్లో ఈ మచ్చులు పెద్దవై ఆకులు ఎండి రాలిపోతాయి. దీనివల్ల కాయల్లో గింజలు సరిగా రావు.

**నివారణ :** లీటరు నీటికి 2.5 గ్రాముల మాంకోజెబ్ లేదా 2 గ్రాముల క్లోరోథాలోనిల్ లేదా 1 గ్రాము కార్బండిజమ్ లేదా 1 గ్రాము థయోఫానేట్ మిథైల్‌ను కలిపి వాడటం ద్వారా ఆకుపచ్చ తెగులుతోపాటు బూడిద తెగులునూ నివారించొచ్చు.

**బూడిద తెగలు :** ఈ తెగులు విత్తిన 30 - 35 రోజుల తర్వాత గాలిలో తేమ ఎక్కువగా ఉన్నప్పుడు ముదురు ఆకులపై బూడిద రూపంలో చిన్నచిన్న మచ్చలుగా కనబడి అవి క్రమేణా పెద్దవై ఆకులపైన, కింది భాగాలకు, కొమ్మలకు, కాయలకు వ్యాపిస్తుంది.



**నివారణ :** లీటరు నీటికి 1 గ్రాము కార్బండిజమ్ లేదా 1 గ్రాము థయోఫానేట్ మిథైల్ లేదా కెరాథేన్ లేదా 1 మిల్లీలీటరు హెక్సాకోవజోల్‌లను కలిపి 10-15 రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారి చేయాలి.

**తుప్పు లేదా కుంకుమ తెగులు :** పైరు పూత దశలో ఈ తెగులు లక్షణాలు కనిపిస్తాయి. ఆకు ఉపరితలంపైన లేత పసుపు వర్ణంగల గుండ్రని చిన్న మచ్చలు ఉంటాయి.



**నివారణ :** లీటరు నీటికి 3 గ్రాముల మాంకోజెబ్, 1 మిల్లీలీటరు డైనోకాప్ లేదా 1 మిల్లీలీటరు ట్రైడిమాన్స్ లేదా 1 గ్రాము బిటర్టనాల్ కలిపి 10 రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారి చేయాలి.

**సీతాఫలం తెగులు (లీఫ్ క్రింకిల్) :** ఇది వైరస్ జాతి తెగులు. ఈ తెగులు విత్తనం ద్వారా ఇంకా పేనుబంక ద్వారా వ్యాపిస్తుంది. తెగులు సోకిన మొక్కల ఆకులు ముడతలుగా ఏర్పడి మందంగా పెద్దవిగా పెరుగుతాయి.



**నివారణ :** లీటరు నీటికి 2 మిల్లీలీటర్ల డైమిథోయేట్ లేదా 1.5 మిల్లీలీటర్ల మోనోక్రోటోఫాస్‌ను కలిపి పిచికారీ చేయాలి.

**ఆకుముడత తెగులు (మొవ్వకుళ్లు) :** ఇది వైరస్ జాతి తెగులు, తామర పురుగుల ద్వారా ఒక మొక్క నుండి వేరొక మొక్కకు వ్యాపిస్తుంది. తెగులు ఆశించిన మొక్కల ఆకుల అంచులు వెనుకకు ముడుచుకొని మెలికలు తిరిగి గిడసబారి రాలిపోతాయి.

**నివారణ :** లీటరు నీటికి 2 మిల్లీలీటర్ల డైమిథోయేట్ లేదా 1.5 మిల్లీలీటర్ల మోనోక్రోటోఫాస్‌ను కలిపి పిచికారి చేయాలి.

**ఆకుముడత తెగులు (మొవ్వకుళ్లు) :** ఇది వైరస్ జాతి తెగులు, తామర పురుగుల ద్వారా ఒక మొక్క నుండి వేరొక మొక్కకు వ్యాపిస్తుంది. తెగులు ఆశించిన మొక్కల ఆకుల అంచులు వెనుకకు

ముడుచుకుని మెలికలు తిరిగి గిడసబారి రాలిపోతాయి.

**నివారణ :** 1 గ్రాము ఎసిఫేట్ లేదా 2 మిల్లీలీటర్ల డైమిథోయేట్ మందును కలిపి పిచికారి చేయాలి.

**పక్షి కన్ను తెగులు (ఆంత్రాక్నోస్) :** ఈ తెగులు సోకిన ఆకులపై లేత పసుపు రంగు అంచులతో కూడిన చిన్నచిన్న గోధుమ రంగు మచ్చలు కనిపిస్తాయి.

**నివారణ :** 3 గ్రా/లీ కాపర్ ఆక్సీక్లోరైడ్

**ఎల్లోమొజాయిక్ తెగులు :** ఇది వైరస్ జాతి తెగులు. ఈ తెగులు తెల్లదోమ ద్వారా వ్యాపిస్తుంది. ఈ తెగులు సోకిన మొక్కల ఆకులు, కాయల మీద పసుపు పచ్చ పొడలు ఏర్పడతాయి.

**నివారణ :** 1.6 మి.లీ/లీ మోనోక్రోటోఫాస్ లేదా 2 మిల్లీలీటర్ల డైమిథోయేట్ మందును పిచికారి చేసి కొంతవరకు నివారించుకోవచ్చు.

## పురుగులు

**రసం పీల్చు పురుగులు :** పైరు తొలిదశలో అంటే 10-30 రోజుల వరకు వివిధ రకాలైన రసం పీల్చే పురుగులు తామర పురుగులు, పచ్చదోమలు, పేనుబంక మొదలగునవి ఆశించి మొక్కలను పెరగనివ్వకుండా చేస్తాయి.

**నివారణ :** లీటరు నీటికి 1.5 మిల్లీలీటర్ల ఎండోసల్ఫాన్ లేదా 1 గ్రాము ఎసిఫేట్‌తో కలిపి పిచికారీ చేయాలి.

**కాండపు ఈగ :** ఈ పురుగు క్రిమి దశ కాండంలో చేరి తినడం వల్ల మొక్క ఎండిపోతుంది. ఎక్కువగా తొలకరి పైరుపై ఆశిస్తుంది.

**నివారణ :** మోనోక్రోటోఫాస్ 1.6 మిల్లీలీటర్ల లేదా ఎసిఫేట్ 1 గ్రాము లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి.

**మరుకా మచ్చల పురుగు :** ఈ పురుగు మొగ్గ, పూత, పిందె దశల్లో ఆశించి ఎక్కువ నష్టం కలుగజేస్తుంది. పూత దశలో పూలను గూడుగా చేసి లోపలి పదార్థాలను తింటుంది.



**నివారణ :** క్లోరిపైరిఫాస్ 2.5 మిల్లీలీటర్లు లేదా క్వినాల్ఫాస్ 2.0 మిల్లీలీటర్లు + డైకోర్వాస్ 1 మిల్లీలీటరు లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి.

**చిత్త పురుగులు :** ఈ పురుగులు పైరుపై రెండు ఆకుల దశలో ఆశించి రంధ్రాలు చేస్తాయి.

**నివారణ :** 2.5 మిల్లీలీటర్ల క్లోరిపైరిఫాస్ లేదా 2 మిల్లీలీటర్ల ఎండోసల్ఫాన్ లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి.

**తామర పురుగులు :** ఈ పురుగులు తొలిదశలో లేత ఆకులపై వృద్ధి చెంది రసాన్ని పీలుస్తాయి. వీటి వల్ల ఆకు ముడత అనే వైరస్ వ్యాధి కూడా వ్యాపిస్తుంది.

**నివారణ :** మోనోక్రోటోఫాస్ 1.5 మిల్లీలీటర్లు లేదా ఎసిఫేట్ 1 గ్రాము మందు లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి.

**తెల్లదోమ :** ఈ పురుగులు ఆకుల్లోని రసాన్ని పీలుస్తాయి. అంతేగాక ఎల్లోమొజాయిక్ అనే వైరస్ వ్యాధిని (పల్లాకు తెగులు) కూడా వ్యాపింప చేస్తాయి.

**నివారణ :** 1.6 మిల్లీలీటర్ల మోనోక్రోటోఫాస్ లేదా 2 మిల్లీలీటర్ల మిథైల్ డెమెటాన్ లేదా 2 మిల్లీలీటర్ల ట్రైజోఫాస్ లీటరు నీటికి కలిపి పిచికారి చేసుకోవాలి.

**పొగాకు లద్దె పురుగు :** ఈ పురుగులు ఆకుల్లోని పచ్చని పదార్థాన్ని గోకి తినడం వల్ల ఆకులు తెల్లగా కనిపిస్తాయి. ఆకులకు రంధ్రాలు చేసి, ఆకులను, పువ్వులను, పిందెలను కూడా తింటాయి. ఈ పురుగులు రాత్రిపూట ఎక్కువగా తింటూ పగలు మొక్కల మొదళ్లలోనూ, భూమి నెర్రెలలోనూ చేరతాయి.

**నివారణ :** ఎకరానికి 30 వేల ట్రైకోగ్రామ బదనికలను వారం తేడాతో రెండు పర్యాయాలు వదలాలి. ఎకరానికి 4 లింగాకర్షక బుట్టలను ఏర్పాటు చేసి పురుగు ఉధృతిని గమనించాలి. చివరిగా ఎండోసల్ఫాన్ 2 మిల్లీలీటర్ల మోనోక్రోటోఫాస్ 1.6 మిల్లీలీటర్లు లేదా క్లోరిపైరిఫాస్ 2.5 మిల్లీలీటర్ల మందును లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి.

**శనగపచ్చ పురుగు :** ఈ పురుగు మొదట ఆకుపై సన్న రంధ్రాలు చేసి పత్రహరితాన్ని తింటూ ఒకటి రెండు రోజుల్లో విప్పారని మొగ్గల్లోకి చొచ్చుకొనిపోయి లోపలి భాగాన్ని తింటుంది. ఎదిగిన పురుగులు కాయల్లోకి తల భాగాన్ని చొప్పించి కాయను తొలుస్తూ మిగిలిన శరీరాన్ని కాయ బయట ఉంచడం ఈ పురుగు ప్రత్యేక లక్షణం.

**నివారణ :** క్లోరిపైరిఫాస్ 2.5 మిల్లీలీటర్లు లేదా క్వినాల్ఫాస్ 2 మిల్లీలీటర్లు లేదా మోనోక్రోటోఫాస్ 0.6 మిల్లీలీటర్లు లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి.



# శనగ కోత

# విత్తన నిల్వ

యస్. రమాదేవి, డాక్టర్. బి.హెచ్. చైతన్య
డాక్టర్. మంజునాథ్ , డాక్టర్. వీర జయలక్ష్మి
అఖిల భారత శనగ పరిశోధన సమన్వయ పథకం,
వ్యవసాయ పరిశోధన స్థానం, నంద్యాల

ఈ సంవత్సరం కురిసిన అధిక వర్షాలవల్ల మన రాష్ట్రంలో ప్రస్తుతం శనగ పంట రెండు దశల్లో ఉన్నది. అక్టోబరు లో విత్తిన శనగ కోత దశలో ఉంది. అయితే నవంబరు వర్షాల కారణంగా దెబ్బతిని డిసెంబరులో విత్తబడిన శనగ పంట పూత, కాయ దశలో ఉన్నది. ఈ వ్యాసంలో ముఖ్యంగా కూలీలతో కోత, యంత్రాలతో కోతలలో ఏది రైతులకు లాభదాయకమని కర్నూలు జిల్లాలో వివిధ శనగ పండించే ప్రాంతాల నుంచి సేకరించిన విషయాల ఆధారంగా చర్చించడం జరిగింది.

ఇప్పటివరకు రైతులు శనగ కోతకు కూలీలపై ఆధారపడుతున్నారు. అనగా కోయడానికి ఎకరానికి రూ.2250 - రూ. 2500, కుప్పలు వేయడానికి రూ.1000, ఆ కుప్పలు నూర్చడానికి రూ.1500-రూ.1700 ఖర్చు అవుతుండగా, ఈ పద్ధతిలో మొత్తం కోతకి ఎకరానికి 4000-6000 రూ. ఖర్చు అవుతుంది. కానీ, ఈ మధ్య కాలంలో రైతులు కూలీల కొరత కారణంగా యాంత్రీకరణ వైపు మొగ్గు చూపుతున్నారు.

### ఈ యాంత్రీకరణలో కొన్ని ప్రధానాంశాలు :

- గింజ నాణ్యత, నిలువ కోసం గింజలో తేమశాతం 10 చేరే వరకు పంటను పొలంలోనే ఎండబెట్టాలి. తర్వాత మిషను ద్వారా కోతకు సిద్ధమవ్వాలి.
- పెద్ద పెద్ద రాళ్ళు, ఎత్తు పల్లాలు లేకుండా చదును చేయబడిన పొలాలు యాంత్రీకరణకు అనుకూలం.
- మిషన్ కోతలో ఎకరానికి దాదాపుగా రూ.2300-రూ.2600 ఖర్చు అవుతుంది. అనగా కూలీ కోత కన్నా యాంత్రీకరణ వలన రైతులకు ఒక్క కోతలోనే రూ.2000-రూ.3500 వరకు ఖర్చు, సమయం ఆదా అవుతుంది.
- ఇప్పటికే శనగను కోయడానికి మార్కెట్‌లో రకరకాల కంపెనీల యంత్రాలు అందుబాటులో వున్నాయి. వాటిల్లో దుష్మాస్ 9100, న్యూహాల్లండ్, కార్టర్, రాజార్ వంటివి రైతుల వద్ద వినియోగంలో వున్నాయి.
- మిషన్ ద్వారా కోతకు అనువైన ఎత్తుగా పెరిగే (45-50 సెం.మీ.) శనగ రకాలు ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా స్థానం, నంద్యాల వారి నుంచి విడుదలైన నంద్యాల గ్రామ్ 47 (ధీర), విడుదలకు సిద్ధంగా వున్న నంద్యాల గ్రామ్ 776, చిరు సంచుల పరీక్షలో ఉన్న నంద్యాల గ్రామ్ 779 రకాలు రైతులకు అందుబాటులో వున్నాయి.

### విత్తన నిల్వ

రైతులు తమ పంటలో కొంత భాగాన్ని విత్తనంగా వాడుకోవడం వల్ల నాణ్యమైన, నమ్మకమైన పంటను పొందడానికి అవకాశముంటుంది. శనగ స్వపరాగ సంపర్కంతో గింజ కడుతుంది. కాబట్టి రైతులు ఒకసారి నాణ్యమైన విత్తనాన్ని వ్యవసాయ పరిశోధన స్థానం, నంద్యాల నుండి కొనుగోలు చేసి మెళకువలు పాటించి తమ పంట నుండి కొంత భాగాన్ని విత్తనంగా వాడుకోవచ్చు.

శనగ పంట 90- 100 రోజులకు కోతకు సిద్ధమవుతుంది. విత్తనంలో తేమ శాతం 10-12 ఉన్నప్పుడు 8 నెలల వరకు నిల్వ

చేసుకోవచ్చు. నిల్వ చేసుకోవడానికి ముందు ఇతర మొక్క భాగాలు, మట్టి, రాళ్ళు, కలుపు విత్తనం, బాగా లేని గాయపడిన విత్తనాలను తీసివేసి, శుద్ధి చేసి, గింజ పరిమాణాన్ని బట్టి గ్రేడింగ్ చేసి మంచి విత్తనాన్ని నాణ్యమైన పాలిథిన్‌తో కప్పబడిన గోనె సంచుల్లోగాని లేక పక్కా గిడ్డంగుల్లోగాని భద్రపరచుకోవాలి. ఎలుకలు గింజను నష్టపరచకుండా చూసుకోవాలి. భూమికి, గది గోడలకు దూరంగా తడి తగలకుండా చెక్క దుంగలపైన విత్తనపు సంచులను పేర్చుకోవాలి.

నిల్వలో ఉన్న గింజను నష్టపరచడంలో గిడ్డంగి పురుగు అతి ముఖ్యమైనది. ఈ పురుగు ఆశించిన గింజలపైన తెల్లని గుడ్లను గమనించవచ్చు. గింజలపైన గుండ్రటి రంధ్రాలు ఏర్పడటం వలన గింజలు విత్తడానికిగాని లేదా తినడానికి గాని పనికిరావు. విత్తనాన్ని ఇళ్ళలో నిల్వ ఉంచినపుడు ఈ పురుగు సోకకుండా ఉండటానికి బూడిద లేదా ఎండిన వేపాకులు లేదా శనగ చొప్పను ఉంచి నిల్వ చేయాలి లేదా ప్రతి 50 కిలోల విత్తనానికి 3 గ్రాముల అల్యూమినియం ఫాస్ఫైట్ (సెల్ఫాస్) బిళ్ళలను ఉంచడం లేదా ఫ్యూమిగెంట్స్ (ఫాస్ఫిన్)తో పొగ ఊదరబెట్టడం వంటి వాటి వలన ఈ పురుగును అలాగే ఎలుకలను అరికట్టవచ్చు. గిడ్డంగుల్లో లేదా విత్తనపు గోదాముల్లో నిల్వ ఉంచినప్పుడు వీటితోపాటు మలాథియాన్ 5% లేదా డైక్లోరోవాస్ (0.05%) 1 మి.లీ. చొప్పున ఒక లీటరు నీటికి కలిపి ప్రతి 20 రోజులకు ఒకసారి పిచికారి చేయాలి. ఈ విధంగా విత్తనాన్ని జాగ్రత్తగా నిల్వచేసుకోవచ్చు.



# మిర్చి రైతుకు నిరాశే !

**• 'తామర'కు దక్కని ఉపశమనం • వర్ష నష్టాలకే ఇన్‌పుట్ సబ్సిడీ • ఎకరాకు 6 వేలు మాత్రమే**

తామర పురుగు ఆశించి మిరప పంట నష్టపోయిన రైతులకు ప్రభుత్వం అందించే పెట్టుబడి రాయితీ (ఇన్‌పుట్ సబ్సిడీ) దక్కలేదు. ఫిబ్రవరి 15న ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి మీట నొక్కి పంటలు నష్టపోయిన రైతులకు ఇన్‌పుట్ సబ్సిడీ విడుదల చేయగా అందులో 'తామర' బాధిత మిర్చి రైతాంగాన్ని పక్కనపెట్టారు. కేవలం నవంబర్‌లో కురిసిన వర్షాలకు మిర్చి పంట దెబ్బతిన్న రైతులకే, అదీ పరిమితమైన సంఖ్యలో ఇన్‌పుట్ సబ్సిడీ మంజూరు చేశారు. సాధారణంగా పంట నష్టం వాటిల్లినప్పుడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి అందించే ఇన్‌పుట్ సబ్సిడీతో పాటు పంటల బీమా పరిహారం సైతం అందుతుంది. తామర తెగులుతో పంట నష్టపోయిన రైతులకు ఇన్‌పుట్ సబ్సిడీ, ఇన్సూరెన్స్ రెండూ వర్తింపజేయాలని రైతులు ఆందోళనలు నిర్వహిస్తున్నారు. కాగా ప్రభుత్వం ఇన్‌పుట్ సబ్సిడీ ఇవ్వలేదు. బీమా సైతం వర్తిస్తుందో లేదోనన్న అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. మిర్చి రైతులను ఆదుకునే విషయంలో ఇప్పటికే కేంద్రం చేతులెత్తేసింది. రాష్ట్రంపై భారం వేసింది. రాష్ట్ర ప్రభుత్వానికి సైతం మిర్చి రైతులకు సాయం చేసే ఉద్దేశం లేనట్లు కనిపిస్తోంది.

### రెండూ ఇచ్చినా తక్కువే

అధిక వర్షాల వలన వాతావరణంలో అసాధారణ మార్పులు చోటు చేసుకొని తామర పురుగు వ్యాపించిందని రైతులు చెబుతున్నారు. వర్షాలు, తెగులు రెండూ పంటను దెబ్బతీసినందున ఇన్‌పుట్ సబ్సిడీ, వాతావరణ ఆధారిత బీమా రెంటినీ వర్తింపజేయమంటున్నారు. సొంత భూమి కలిగిన రైతు ఎకరానికి రూ.లక్ష, కౌలు రైతు లక్షన్నర వరకు పెట్టుబడి నష్టపోయినందున ప్రత్యేక కేసు కింద పరిగణించి కనీసం



ఎకరానికి లక్ష పరిహారం ఇవ్వమని కోరుతున్నారు. పంట నష్టం జరిగి నెలలు గడుస్తున్నా ప్రభుత్వం మిర్చి రైతుల గోడు వినిపించుకోవడంలేదు.

### 50 వేల ఎకరాలకే..

ఖరీఫ్‌లో 4.64 లక్షల ఎకరాల్లో మిర్చి సాగు కాగా సగానికిపైగా విస్తీర్ణంలో పూర్తిగా పంట తుడిచిపెట్టుకు పోయింది. ఒక్క గుంటూరు జిల్లాలోనే రెండు లక్షల ఎకరాలు పూర్తిగా పోయింది. ప్రకాశం, కర్నూలు, కృష్ణా, అనంతపురంలో సైతం దాదాపు అంతే. పంట నిలిచిందనుకున్న చోట సైతం ఎకరానికి రెండు మూడు క్వింటాళ్ళు, అదీ నాణ్యత లేని మిరప కాయల దిగుబడి వచ్చింది. తమను ప్రభుత్వం ఆదుకుంటుందని రైతులు ఎదురు చూస్తుండగా, వర్షాల వలన 50,604 ఎకరాల్లో పంట నష్టం చవిచూసిన 31,199 మంది రైతులకు సర్కారు రూ.30.73 కోట్ల ఇన్‌పుట్ సబ్సిడీ జమ చేసింది. ఎకరానికి సగటున రూ.ఆరు వేల వంతున ఇచ్చి చేతులు దులుపుకుంది.

# చూడి పరీక్ష - చూడి పశువుల యాజమాన్యం - జాగ్రత్తలు





డాక్టరు జి.రాంబాబు,
పశు వైద్య సహాయ
శస్త్ర చికిత్సకులు, కడప

పాడి పరిశ్రమలో విజయం సాధించాలంటే చక్కటి యాజమాన్య పద్ధతులు పాటించడం తప్పనిసరి. కృత్రిమ గర్భధారణ చేసిన 60 రోజులకు తప్పనిసరిగా చూడి పరీక్ష చేయించాలి. తిరిగి కట్టుకు రానంత మాత్రాన పశువు చూడిది అనుకుని పరీక్ష చేయించడం మరువకూడదు. ముందుగా చూడి పరీక్షలు నిర్వహించడం వల్ల ఒకవేళ చూడి లేకపోతే కారణాలు తెలుసుకొని చికిత్స చేయించడానికి వీలుపడుతుంది.

కృత్రిమ గర్భధారణ చేయించిన తేదీని కూడా రాసి పెట్టుకోవాలి. ఈ విధంగా గుర్తుంచుకోవడం వల్ల పశువు చూచాయిగా ఈన బోవు సమయాన్ని అంచనా వేయొచ్చు. ఎందుకంటే ఆవుల్లో గర్భధారణ కాలం 9 నెలలు లేదా 272 రోజులు (270-290 రోజులు). అదే గేదెల్లో అయితే 10 నెలలు లేదా 310 రోజులు (310 - 330 రోజులు). కాబట్టి నెలలు నిండిన తర్వాత ఆ పశువును జాగ్రత్తగా గమనించడానికి, ఈనడానికి తగిన ఏర్పాట్లు చేయడానికి వీలవుతుంది.

### చూడి పశువుల యాజమాన్యం

- చూడి పశువులను ఎక్కువ దూరం నడిపించకూడదు. పరుగెత్తించకూడదు. ఎత్తు ప్రదేశాలకు వెళ్లనివ్వకూడదు.
- చూడి పశువుల చేత బరువులు మోయించకూడదు. ఇతర పనులు చేయించకూడదు. ఇలా చేయిస్తే గర్భవిచ్ఛిత్తి జరిగే అవకాశం వుంది.
- చూడి పశువుకు 3వ నెల, 6వ నెల సమయంలో నట్టల నివారణ ముందులు వాడాలి.
- చూడి పశువు పొదుగును ఈనడానికి నెల ముందుగా మర్ధన చేయాలి. దీనివల్ల పొదుగు బాగా పెరుగుతుంది. ముఖ్యంగా తొలి ఈత పశువుల్లో మర్ధన చేయడం వల్ల చాలా ఉపయోగం వుంటుంది.
- చూడి పశువు ఈనడానికి 45-60 రోజుల ముందు పాలు పితకకుండా వదిలేయాలి. ఇలా చేయడం వల్ల పొదుగులోని పూర్వ కణజాలం నశించి, కొత్త కణజాలం ఏర్పడుతుంది. ఈనిన తరువాత పాల ఉత్పత్తి కూడా పెరుగుతుంది.
- పశువు నిండు చూలుతో ఉన్నప్పుడు మేతకు బయటకు పంపించకూడదు.
- చూడితో ఉన్న పశువులను ఎదలో ఉన్న ఇతర పశువులనుగాని, ఆబోతులనుగాని ఎక్కకుండా చూడాలి. చూడి పశువులను ఇతర పశువులతో కలవకుండా విడిగా లేక వేరే పాకలో ఉంచాలి. ఇక్కడ నేల జారుడుగా లేకుండా చూసుకోవాలి. బయటకు వదిలేటప్పుడు ఇరుకైన మార్గాలు లేకుండా చూసుకోవాలి.

### చూడి పశువుల మేపు

చూడి పశువులకు సమృద్ధిగా పచ్చి మేత వేయాలి. చూడి దశలో పశువును దాని శరీర పోషణకు, గర్భంలోని పిండం అభివృద్ధికి కూడా పోషక పదార్థాలు అవసరం. ఈ దశలో అదనంగా మేత, దాణా ఇవ్వాల్సి ఉంటుంది. చివరి రెండు మాసాల చూడిలో పశువుకు ఒక కిలో దాణా, 30 గ్రాముల ఖనిజ లవణ మిశ్రమం అదనంగా ఇవ్వాలి.

### ఈనబోయే పశువు కనబరిచే లక్షణాలు

- నెలల నిండిన పశువు నెమ్మదిగా నడుస్తుంది.

- పొదుగు బాగా పెరుగుతుంది. తొలి చూలు పశువులో పొదుగు 4 నెలల నుండే పెరగడం ప్రారంభం అవుతుంది. పొదుగును గమనించడం ద్వారా పశువు కట్టిందని గ్రహించవచ్చు. అదే ఈతల పశువులో ఈనడానికి రెండు వారాల ముందర మాత్రమే పొదుగు పెరుగుతుంది.
- తొలి చూలు పశువులో 4వ నెల నుండే చన్నుల నుండి పిండినప్పుడు జిగురుగా తీగ వంటి ద్రవాన్ని గమనించవచ్చు. పశువు ఈనే ముందర పసుపు పచ్చని ముర్రుపాలగా మారుతుంది.
- పశువు ఈనడానికి కొద్ది రోజుల ముందర మడి పెరుగుతుంది. ఇతర పశువులతో కలవక ప్రశాంతమైన ప్రదేశాన్ని కోరుతుంది.
- మేత తీసుకోవడం మందగిస్తుంది. శ్వాస క్రియ వేగంగా పెరుగుతుంది.
- శరీర ఉష్ణోగ్రత ఒక డిగ్రీ నుండి రెండు డిగ్రీల ఫారన్‌హీట్‌కు పెరుగుతుంది.
- హార్మోన్ల ప్రభావంతో గర్భద్వారం మెత్తబడి తెరుచుకోవడం మొదలవుతుంది.

## పశువు ఈనేటప్పుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలు

1. నెలలు నిండిన పశువు సరిగ్గా ఏ రోజు ఏ సమయంలో ఈనుతుందో చెప్పలేము. కానీ సాధారణంగా పశువులు రాత్రి వేళ లేదా తెల్లవారుజామున ఈనడం గమనించవచ్చు. బహుశా ఆ సమయంలో ప్రశాంతంగా ఉండటం, తక్కువ అలజడి, వత్తిడి ఉండటం వల్ల కావచ్చు.

2. ఈనే లక్షణాలు కనిపించిన వెంటనే పశువును వేరే పాకలో శుభ్రమైన వరిగడ్డితో పక్కవేసి ఉంచాలి.

- రాత్రి వేళలో తరచుగా గమనిస్తూ ఉండాలి. లేకపోతే అపుడే పుట్టిన దూడను కానీ, మాయను కానీ కుక్కలు తీసుకువెళ్లే ప్రమాదం ఉంది. లేదా మాయను తల్లి పశువు తినే ప్రమాదం ఉంది.
- సాధారణంగా పశువులు ఈనేటప్పుడు ఎలాంటి సహాయమూ లేకుండానే ఈనతాయి. కానీ కనిపెట్టుకుని ఉండటం వల్ల ఒకోసారి దూడ అడ్డం పడినప్పుడు లేదా వెనుక కాళ్లు వచ్చినప్పుడు వెంటే పశు వైద్యుల సహాయం తీసుకొని దూడకు తల్లికి ప్రాణాపాయం లేకుండా చూడవచ్చు.
- ఈతల పశువు నొప్పులు మొదలైన 2 గంటలలోగా ఈనుతుంది. అదే తొలిచూలు పడ్డ అయితే ఎక్కువ సమయం పడుతుంది. ఒక వేళ ఈనలేకపోతే డాక్టరును సంప్రదించాలి. అంతేకాక దూడను లాగడానికి ప్రయత్నించకూడదు. ఇతరులను చేతులు పెట్టనివ్వరాదు. ముందర కాళ్లు, తల బయటికి వస్తే ఆందోళన పడనవసరం లేదు.
- తల ఒక కాలు లేదా తల మాత్రమే లేదా కాళ్లు మాత్రమే లేదా వెనుక కాళ్లు మాత్రమే వస్తే ఈనడం కష్టం. అలాంటి సమయంలో వెంటనే పశు వైద్యుల సహాయం పొందాలి.
- ఈనిన వెంటనే దూడకు తల్లి దగ్గర జున్ను పాలు తాపాలి. దీనివల్ల ఆక్సీటోసిన్ అనే హార్మోన్ ఉత్పత్తి అయ్యి మాయ సకాలంలో వేస్తుంది
- ఈనిన తర్వాత మంచి పాడిసార కలిగిన పశువులకు పాల జ్వరం రాకుండా కాల్షియం ఇంజెక్షన్లు ఇప్పించాలి.

## పశువులకు ఎప్పుడు చూడి పరీక్ష జరపాలి?

పశువుకు కృత్రిమ గర్భధారణ జరిపించిన 60-90 రోజులకు చూడి పరీక్ష నిర్వహించవచ్చు. తరుపులలో 45 రోజులకే గర్భాశయం కొలతలో తేడాను గమనించొచ్చు. తిరిగి నెల రోజుల తర్వాత చూడి నిర్ధారణ చేయవచ్చు.

## చూడి పరీక్ష చేసే విధానం

1. చేతల గోర్లు కత్తిరించుకొని శుభ్రపరుచుకోవాలి.
2. గమ్ బూట్లు, గ్లోవ్స్, ఏప్రాన్ ధరించాలి
3. చేతికి సాఫ్ట్ సోప్ రాసుకోవాలి.
4. పశువును ట్రెవిస్‌లో పెట్టి సురక్షితంగా ఉంచాలి
5. ముందుగా పశువుకు ఎప్పుడు కృత్రిమ గర్భధారణ చేయించబడినదీ లేదా ఆబోతును దాటించినదీ తెలుసుకోవాలి. దీనివల్ల సుమారు ఎన్ని రోజుల చూడి అన్నది అంచనా వేయొచ్చు.
6. చేతి వేళ్లను ఒక చోట చేర్చి ముక్కోణపు ఆకారం చేసి నెమ్మదిగా రెక్టమ్ లోనికి పోనివ్వాలి.
7. ఎక్కువగా పేడ ఉంటే తీసివేయాలి.
8. పశువు ముక్కుతుంటే పరీక్ష చేయకుండా చేతిని అలాగే ఉంచాలి. ముక్కడం ఆగిపోయిన తరువాత తిరిగి పరీక్ష చేయాలి.
9. పలుమార్లు చేతిని బయటకు తీసి మళ్లీ పెడుతుంటే పేడ వచ్చే రంధ్రంలో గాలి చేరుతుంది. అలాంటి సమయాల్లో పరీక్ష చేయడం కష్టం.
10. చేతితో నెమ్మదిగా తొలుత గర్భాశయ ముఖద్వారాన్ని గుర్తించాలి.
11. తరువాత చేతిని కొంచెం ముందుకు పోనిచ్చి గర్భాశయాన్ని సున్నితంగా పరీక్షించాలి.
12. పశువు రెండు, రెండున్నర మాసాల చూడిదయితే గర్భాశయ శృంగాలలో ఒకటి పెద్దదిగా ఉబ్బి ఉంటుంది. గర్భాశయపు శృంగాల మధ్య చీలికలో చూపుడు వేలు పెట్టి ఒక్కొక్క శృంగాన్ని పరీక్షించితే ఈ తేడాను గమనించొచ్చు.
13. పశువు మూడు మాసాల చూడి అయితే గర్భము ఊపురు బుడ్డ వలే కటి కుహరము, ఉదర కుహరము మధ్యలో ఉంటుంది.
14. నాలుగు మాసాల చూడిదయినప్పుడు దూడ బరువు, ఉమ్మ నీటి శాతం పెరిగి గర్భాశయం ఉదర కుహరం లోనికి జారుతుంది. గర్భాశయ ముఖద్వారము ఆ బరువుకు ముందుకు జరిగి కటి కుహరపు అంచు వద్ద ఉంటుంది. ఈ దశలో కటి కుహరానికి ఇరువైపులా గర్భాశయానికి రక్త ప్రసరణ చేసే ధమనిలో రక్త ప్రవాహపు ప్రకంపనలు గమనించవచ్చు
15. ఐదు నెలల నుండి ఆరు నెలల మధ్య కాలంలో దూడ పరిమాణం, బరువు పెరిగి ఉదర కుహరం కింది భాగంలో చేతికి తగులుతుంది.
16. ఆరు నెలలు దాటిన తర్వాత నుండి దూడ పరిమాణం మరింత పెరిగి దూడ భాగాలు చేతికి తగులుతాయి.

# హైడ్రోఫోనిక్స్ సాగు విధానం




డాక్టర్. నిరోష, డాక్టర్. ఎస్ మల్లేష్,
జి విద్య, డాక్టర్. బి నవీన్ కుమార్
అసిస్టెంట్ ప్రొఫెసర్లు, ఉద్యాన కళాశాల,
శ్రీ కొండా లక్ష్మణ్ తెలంగాణ స్టేట్ హార్టికల్చర్
యూనివర్సిటీ, రాజేంద్రనగర్, హైదరాబాద్

మారుతున్న కాలానికి అనుగుణంగా రోజురోజుకు భారతదేశ జనాభా పెరుగుతున్న తరుణంలో దేశ జనాభాకు ఆహారం అందించడంలో విఫలమవుతున్నాం. కాబట్టి ఆకుకూరలు, పండ్లు, పూలు పండించడానికి సరికొత్త విధానాలను అనుసరించడంలో ఎంతో ఆవశ్యకత ఉన్నది. గ్రామాలలో కాకుండా పట్టణ, నగరంలో పంటలు పండించడం వ్యవసాయం భాగమే. నగర వ్యవసాయ పద్ధతులైన కిచెన్ గార్డెన్, రూఫ్ గార్డెన్, కమ్యూనిటీ ఫార్మింగ్, విండో ఫార్మింగ్, ఆక్వాపోనిక్స్, హైడ్రోపోనిక్స్ మొదలగునవి. ఇటీవలే కాలంలో హైడ్రోపోనిక్స్ విధానం పట్టణ ప్రాంతాల్లో ఎంతో ప్రాచుర్యం పొందుతున్నది. గ్రామాల్లో రైతులే కాకుండా పట్టణ ప్రాంతాల్లో నివసిస్తున్న ప్రజలు కూడ వ్యవసాయం చేయటం వల్ల ఆహార సమతుల్యతను సాధించవచ్చు. ఈ హైడ్రోపోనిక్స్ విధానంలో ఆకుకూరలు, కాయగూరలు, పండ్లు, పూలు పండించవచ్చు.

## హైడ్రోఫోనిక్స్ సాగు

మట్టి లేకుండా అనేక రకాలను సేంద్రియ రసాయనిక పదార్థాలను ఉపయోగించి నీటిలో మొక్కలు పెంచే విధానాన్ని హైడ్రోపోనిక్స్ లేదా మట్టి లేని సాగు, పోషక ద్రవం సాగు అని రకరకాలుగా పిలుస్తారు.

## హైడ్రోఫోనిక్స్ సాగువల్ల ఉపయోగాలు :

1. పట్టణ ప్రాంతాల్లో పంటలు పండించాలనే ఆసక్తి కలవారికి హైడ్రోపోనిక్స్ ఒక విధానం, పండించటానికి స్థలం లేకపోయినా ఇంటి పైకప్పుపై లేక ఇంటి ముందున్న స్థలం లోనే పండించవచ్చు.
2. నీటి లభ్యత తక్కువ వున్న ప్రదేశంలో కూడా పెంచవచ్చు.
3. కూలీలు అవసరం లేకుండానే సాగు చేయవచ్చు.
4. కలుపు మొక్కలు లేకుండా పెంచడానికి అనువైన విధానం ఇది
5. మొక్కకు కావల్సిన గాలి, నీరు పోషకాలను సమతుల్యంగా పండించవచ్చు.
6. అనేక జాతి మొక్కలను అనేకసార్లు పెంచవచ్చు.
7. సాంప్రదాయ వ్యవసాయ పద్ధతిలోకన్నా హైడ్రోపోనిక్స్ విధానంలో తక్కువ ఖర్చుతో తక్కువ కాలంలోఎక్కువ ఉత్పత్తులను పొందవచ్చు.
8. సరైన యాజమాన్యం పద్ధతులను ఉపోయోగించి అధిక దిగుబడులు సాధించవచ్చు.
9. కాలంకాని కాలంలోనూ అనగా (ఎండ, చలి, గాలి, వాన ) కూడా పండించవచ్చు.
10. అనేక రకాలైన కూరగాయలను, పూల మొక్కలను పెంచడానికి అవకాశం ఉంది.
11. భూమిలో నివసించే క్రిమి కీటకాలు, శిలీంద్రాల ద్వారా పంటను ఆశించే తెగుళ్ల బారిని తగ్గించవచ్చు.
12. పంటకు నీరు పెట్టడానికి మడులు, కాలువలు చేయాల్సిన అవసరం లేదు.
13. తక్కువ శ్రమతో కలుపు తీయడం లేకుండా పండించవచ్చు.
14. మనకున్న స్థలంలోనే పరిశుభ్రమైన తాజా ఉత్పత్తులను, ఎక్కువ ఉత్పత్తులను సాధించవచ్చు.
15. పురుగు మందులు వాడడం, కలుపు మొక్కలను అరికట్టడానికి ఉపయోగించే కలుపు మందులు వాడడం వలన అనారోగ్య పరిణామాలను నివారించవచ్చు.
16. మొక్కలు నాటడానికి భూమి తయారీ ఖర్చులు, శ్రమ, సమయం ఆదా చేయవచ్చు.



17. నీటి ద్వారా పోషకాలను అందిస్తున్నాం కనుక మట్టి అవసరంలేదు, నీటిని శుద్ధి చేసి తిరిగి వాడుకోవచ్చు కనుక నీటి ఖర్చు తక్కువ పోషకాల పరిమాణాన్ని నియంత్రించవచ్చు. కనుక పోషకాల వృధా తగ్గి ఖర్చు తగ్గుతుంది.
18. ప్లాంటింగ్ పాట్స్ పెంచుతాం కనుక కీటకాలు, తెగుళ్లను, పురుగులను నివారించడం సులభం.

**హైడ్రోపోనిక్స్ పద్ధతిలో ప్రతికూలతలు :**

1. నిరంతరం నీటి సరఫరా ఉండాలి.
2. హైడ్రోపోనిక్స్ విధానాన్ని ఏర్పాటు చేసుకోడానికి ప్రారంభ దశలో పెట్టుబడులు ఎక్కువ.
3. వివిధ పోషకాలు కలపడంలోనూ తెగుళ్ల నివారణలోను అనుభవజ్ఞులైన వ్యక్తులు అవసరం.
4. వ్యాపార సరళిలో పంటలు పండించటానికి మంచి అవగాహన, సాంకేతిక పరిజ్ఞానం అవసరం.

**హైడ్రోపోనిక్స్ పద్ధతిలో పెంచుకో దగిన ఉద్యాన పంటలు**

1. **ఆకుకూరలు :** గోంగూర, తోటకూర, పాలకూర, మెంతికూర, కొత్తిమీర.
2. **కూరగాయలు :** టమోటాలు, వంకాయలు, క్యాప్సికం, క్యాబేజి, మిరపకాయలు.
3. **పండ్ల మొక్కలు :** స్ట్రాబెర్రీ
4. **పూలమొక్కలు :** బంతి, చామంతి, గులాబీ .

**గార్డెన్ ఏర్పాటు :** ఎక్కువ గాలి, నీరు, ఎండ ఉన్న ప్రదేశాలలో ఈ పద్ధతిని అమర్చకూడదు. హైడ్రోపోనిక్స్ విధానానికి పెంపుడు జంతువులు, ఆవులు, కోతులు, కుక్కలు దూరంగా ఉండేటట్లు చూడాలి. సూర్యరశ్మి మొక్కకు బాగా అందే ప్రదేశంలో అమర్చాలి.

**హైడ్రోపోనిక్స్ పెంచే పద్ధతి :**

1. ఓపెన్ పద్ధతి
2. క్లోజ్ పద్ధతి

**1. ఓపెన్ పద్ధతి :** ఈ పద్ధతిలో పోషకాలను నీటిలో కలిపి మొక్కకు అవసరాన్ని బట్టి ఇస్తాము. ఈ పద్ధతిలో పోషకాలను తిరిగి వాడడం ఉండదు. ఉదాహరణ : ఏ) కుండీలు, ప్లాస్టిక్ సంచులు, పాత టైర్లు, వాటర్ క్యాన్లలో పెంచవచ్చు. బి) ప్లాస్టిక్ పీవీసి పైపులలో ఉర్ధ్వంగా లేదా సమాంతరంగా పెంచవచ్చు.

**2. క్లోజ్ పద్ధతి :** ఈ పద్ధతిలో సబ్‌మెర్సిబుల్ పంపును ఉపయోగించి మొక్కకు కావాల్సిన పోషకాలను నిరంతర పోషక ద్రవం ప్రసరణ జరుగుతుంది. ఇందులో మొక్క వేర్లు ద్రావణంలో నిరంతరం తేలుతూ ఉంటాయి.

**హైడ్రోపోనిక్స్ నిర్మాణానికి కావాల్సినవి :**

సబ్‌మెర్సిబుల్ పంపు స్టోరేజ్ ట్యాంక్, జాయింట్స్, టీ జాయింట్స్, టాప్, ఎల్ బో జాయింట్, ఫ్లెక్సిబుల్ పైప్, కనెక్టర్, ఎండ్ క్యాప్, ప్రోగ్రామబుల్ టైమర్.

**సబ్‌మెర్సిబుల్ పంప్ :** ఈ పంప్ ధర రూ.200-300/- వరకు వుంటుంది. ఈ పంప్ గంటకు 200-300 లీటర్ల నీటిని 4 అడుగుల ఎత్తు వరకు నీటిని అందజేయగలదు. ఈ పంప్ విద్యుత్‌తో పనిచేస్తుంది.

**స్టోరేజ్ ట్యాంక్ :** ఈ స్టోరేజ్ ట్యాంక్‌లో నీరు, పోషకాల మిశ్రమం ఉంటుంది. ఇందులో సబ్‌మెర్సిబుల్ పుంపును అమర్చి ఎల్లప్పుడు, పీవీసి పైప్ నందు పోషకాల ప్రసరణ జరుగుతుంది.

ఫ్లెక్సిబుల్ పైప్, జాయింట్, టీ-జాయింట్, ఫ్లో కంట్రోల్ వాల్వ్, ఎల్బో జాయింట్, ఎండ్ కాప్స్ అవసరం.

**హైడ్రోపోనిక్స్‌లో పెంచే పద్ధతులు :**

1. న్యూట్రియెంట్ ఫిల్మ్ పద్ధతి
2. డీప్ ఫ్లో

**1. న్యూట్రియెంట్ ఫిల్మ్ పద్ధతి (ఎన్.ఎఫ్.టి)**

ఈ పీవీసీ పైప్ లేదా గట్టర్ ద్వారా పలుచటి నీటి పొర మొక్కల పేర్లను తాకుతూ పైపులలో ప్రసరణ జరుగుతుంది. ఈ పద్ధతి మొక్కలకు అవసరమయ్యే పోషకాలు, కాంతి, ఉష్ణోగ్రత, తేమ శాతం మొక్కకు సరిపడేలా అమర్చాలి. ఇది చాలా పల్చటి పొర కావడం వల్ల నీరు నిల్వ ఉండే అవకాశాలు వుండవు. పోషక ద్రావణం ప్రసరణ ఎల్లప్పుడు జరగటం ఈ పద్ధతిలో చాలా అవసరం. పంప్ ఎల్లవేళలు పనిచేయడం చాలా అవసరం. ఈ పద్ధతిని విద్యుదుత్పత్తి అంతరాయం ఏర్పడే స్థలాలలో అమర్చరాదు.

**2. డీప్ ఫ్లో పద్ధతి :** ఈ ఏఎన్. ఎన్. ఎఫ్.టి విరుద్ధంగా, ఎఫ్‌టిలో కొంత పోషక ద్రావణం, ఎల్లప్పుడు కొద్ది లోతులో ఉంటుంది. ఎక్కువ పోషకాలను నిర్ణీత సమయాల్లో ఓవర్ పైప్ ద్వారా పంప్ సహాయంతో పంపిస్తారు. ఎక్కువైన పోషకాలను తిరిగి స్టోరేజీ ట్యాంక్‌కు చేరుకుంటుంది, విద్యుచ్ఛక్తి అంతరాయాలేర్పడిన కొంత నీరు ఎల్లప్పుడు ఉంటుంది కాబట్టి మొక్క పెరుగుదలపై ప్రభావం ఉండదు.

**ట్రేలలో మొక్కలను పెంచడం :**

1. "గ్రీన్ సలాడ్ భేల్" వంటి రకం మంచి నాణ్యమైన విత్తనాన్ని మంచి నాణ్యమైన కొబ్బరి పిట్టులో చేసిన రంధ్రాలలో ఒక్కొక్క రంధ్రంలో రెండు విత్తనాలను వేసి చేతితో మెల్లగా నొక్కి కొంత విత్తన భాగం కనబడేటట్లు పైపైన విత్తాలి.

2. ట్రేని పలుచని పాలిథిన్ కవర్తో కప్పాలి.
3. విత్తనం మొలకెత్తడాన్ని గమనిస్తుండాలి.
4. మొలక బయటకు రావడం గమనించగానే పైన ఉన్న కవర్ని తీసివేసి వెలుతురున్న ప్రదేశంలో పెట్టాలి.
5. మొలకలు వచ్చిన తరువాత కవర్ని తీసివేయాలి.
6. మొలకలు రాగానే సూర్యరశ్మి, పోషకాలు, సిఫారుసు చేసిన మోతాదులో సగం మోతాదు పోషక (19:19:19) ద్రావణాన్ని మొక్కలకు అందించాలి.
7. రెండు వారాల తరువాత నారు మొక్కలు నాటడానికి సిద్ధంగా ఉంటాయి.
8. రెండు వ్యాసమున్న నెట్ కుండీ అడుగు భాగంలో మొక్కల వేర్లు దూరి బయటకు రావడానికి వీలుగా రంధ్రాన్ని చేయాలి. 9. నారు మొక్కను ట్రే నుండి వేరు చేసి, దానికి అంటి ఉన్న కోకోపీట్ నీటిలో కడగాలి.
10. నారు మొక్కను నెట్పాట్లో ఉంచి కోకో హస్క్ను నింపాలి.
11. ఈ పద్ధతిలో నాలుగు అంగుళాల వ్యాసంగల పీవీసీ పైపు వెన్నెముక లాంటిది. ఈ పైపుల్లో నేటీ పాట్లను అమర్చే విధంగా 2.5 అంగుళాల వ్యాసంగల రంధ్రాలను చేయాలి. ఈ పైప్ చివర నుండే మూతలను లీకేజీ లేకుండా మూసివేయాలి. ఒక చివరి మూతలకున్న మార్గం ద్వారా నీరు బయటకు పోతుంది. ఏ సమయంలోనైనా 2 - 2.5 అంగుళాల పోషక ద్రావణం ఎల్లప్పుడూ పైప్లో ఉంటుంది. ఇంతకన్నా ఎక్కువ అయితే పోషక ద్రావణం స్టోరేజీకి, ట్యాంక్లోకి తిరిగి పోతుంది. ఒక వేళ ఈ పైపు క్రింద ఉంచేటట్లయితే పైప్ 2.5 అంగుళాల పోషక ద్రావణం ఉండేటట్లు చూసుకోవాలి
12. నెట్ పాట్లను పైప్కి చేసిన రంధ్రాలలో ఉంచాలి.
13. టైమర్ సహాయంతో పోషక ద్రావణాన్ని నిర్ణీత కాలంలో ప్రసరింపజేస్తే మొక్కలకు గాలి తెగిపోవడం ఉండదు. ఉదజని సూచిక, లవణ సాంద్రతలను కూడా క్రమం తప్పకుండా తనిఖీ చేస్తూ ఉండాలి.
14. నాటిన 10 రోజుల తరువాత మొక్క ఎదుగుదల కనిపిస్తుంది. 20 రోజుల తరువాత పెరుగుదల ఇంకా అధికమవుతుంది.
15. ప్రతిరోజు పరిమాణంలో మెరుగుదల కనిపిస్తుంది.
16. నాటిన నెల రోజుల తరువాత మెంతి పూర్తి పరిమాణానికి పెరుగుతుంది.
17. పూర్తిగా పెరిగిన మెంతి మొక్కల వేర్లు పూర్తిగా ఆక్సిజన్ అందడంవల్ల తెల్లగా ఉంటాయి.
18. కోత తరువాత ఒకొక్క కుండి నుండి 260-280 గ్రాముల మెంతి వస్తుంది.
30. చదరపు అడుగుల విస్తీర్ణంలో ఈ హైడ్రోపోనిక్స్ విధానాన్ని అమర్చడానికి 8500/- ఖర్చు అవుతుంది. అదే విధంగా 20 చదరపు అడుగుల విస్తీర్ణంలో అమర్చడానికి 5000/- ఖర్చు అవుతుంది.

## రైతు సంఘం కర్నూలు జిల్లా స్థాయి వర్క్ షాప్

రైతులను మోసం చేస్తున్న కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల చర్యలను ఎండగట్టాలని ఏపీ రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు పి.నరసింహారావు డిమాండ్ చేశారు. కర్నూలు జిల్లా నంద్యాలలోని టి.నరసింహయ్య భవనంలో రైతు సంఘం జిల్లాస్థాయి వర్క్ షాప్ జరిగింది. ఈ సమావేశానికి జిల్లా అధ్యక్షులు టి.రమేష్ కుమార్ అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో నరసింహారావు మాట్లాడుతూ.. ప్రభుత్వం అనేక మార్లు రైతులకు ఇచ్చిన హామీలను అమలు చేయడంలో పూర్తిగా విఫలమైందని అన్నారు. సీడ్స్ కంపెనీలు రైతులను నట్టేట ముంచాయన్నారు. నకిలీ విత్తనాలు ఇచ్చి పంటలు వేసుకోమనడంతో అనేక మంది రైతులు అవి వేసి నష్టపోయారన్నారు. కార్యక్రమంలో జిల్లా కార్యదర్శి ఎ.రాజశేఖర్, జిల్లా నాయకులు పుల్లా నరసింహ, వెంకటేశ్వరరావు, సుధాకర్ తదితరులతోపాటు వివిధ మండలాల నుండి రైతులు పాల్గొన్నారు.

## యు.పిలో రైతుల వినూత్న నిరసన



యుపిలోని బారాబంకిలో పశువుల వల్ల కలిగే ఇబ్బందులను ప్రభుత్వానికి ఎత్తిచూపేందుకు వినూత్నంగా నిరసన తెలిపారు. ముఖ్యమంత్రి యోగి ఆదిత్యనాథ్ ర్యాలీ జరిగే మైదానంలోకి వందలాది పశువులను విడిచిపెట్టారు. దీనికి సంబంధించిన ఫోటోను రైతు నేత రమణదీప్ సింగ్ మాన్ పోస్ట్ చేశారు. వందలాది మంది రైతులు పశువులను తమ పొలాల నుండి తరిమి కొట్టి బారాబంకిలో యోగి ఆదిత్యనాథ్ ర్యాలీ జరిగే స్థలంలో విడిచిపెట్టారు. విచ్చల విడిగా తిరుగుతున్న పశువులను అడ్డుకునేందుకు మార్గం కనిపించడం లేదని ట్విటర్లో పేర్కొన్నారు. ఐదేళ్లుగా యుపి ప్రభుత్వం ఈ సమస్యను పరిష్కరించలేకపోయిందని, కనీసం ర్యాలీకి ముందైనా ఆ పశువుల సమస్యను పరిష్కరిస్తారో చూడాలని ఆయన ట్వీట్ చేశారు. యుపిలో పశువుల సమస్యను పరిష్కరిస్తామని గతవారం హామీ ఇచ్చిన క్లిప్ని పంచుకున్నారు. విచ్చలవిడిగా తిరుగుతున్న పశువులను నియంత్రించేందుకు, వాటిని సంరక్షించేందుకు మార్చి 10 అనంతరం కొత్త వ్యవస్థను ఏర్పాటు చేస్తామని మోడీ పేర్కొన్నారు. ఉడిగి పోయిన పశువుల పేడ ద్వారా కూడా ఆదాయం వచ్చేలా వ్యవస్థ రూపొందించ బడుతుందని మోడీ హామీ ఇచ్చారు. గత ఐదేళ్లుగా యోగి ప్రభుత్వం ఈ సమస్యను పట్టించుకోలేదని కాంగ్రెస్ విమర్శించింది. ఎన్నికల ముందు యోగి, మోడీలకు ఈ విషయం గుర్తుకు వచ్చిందని ఎద్దేవా చేసింది. 2019లో యోగి ఆదిత్యనాథ్ ప్రభుత్వం రాష్ట్ర బడ్జెట్లో పశువుల షెడ్లకు నిధులు కేటాయించిన సంగతి తెలిసిందే. పశువులు విచ్చలవిడిగా తిరుగుతూ పంటలను నాశనం చేస్తున్నాయని రైతులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

# వేసవి బెండ సాగులో మెలకువలు

కె. నిరోష, అసిస్టెంట్ ప్రొఫెసర్,
ఎం. మాళవిక, పిజి స్టూడెంట్,
ఉద్యాన కళాశాల, ఎస్‌కెఎల్‌టిహెచ్‌యు,
రాజేంద్రనగర్,

బెండను ఉష్ణ, సమశీతోష్ణ మండలాల్లో ప్రపంచ వ్యాప్తంగా సాగు చేస్తున్నారు. మన దేశంలో వ్యాపార సరళిలో గుజరాత్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, ఉత్తరప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక, హర్యానా, పంజాబ్ రాష్ట్రాలలో పండిస్తున్నారు. బెండలో అధిక దిగుబడినిచ్చే సూటి రకాలు, హైబ్రిడ్ రకాలు అందుబాటులో వున్నాయి. అభ్యుదయ రైతులు కేవలం కూరగాయ పంటగా సాగు చేసి అధిక దిగుబడి సాధించడమే గాక, విత్తనోత్పత్తిని చేపడితే అధిక ఆదాయాన్ని పొందడమే గాక కల్తీ విత్తన సమస్యను నివారించవచ్చు.

ఉమ్మడి రాష్ట్రాల్లో బెండ సుమారుగా 33,880 విస్తీర్ణంలో 50,8200 టన్నుల ఉత్పత్తిలో సాగు సాగుతోంది. బెండలో ఎ,బి,సి విటమిన్లు, పలు పోషక పదార్థాలతోపాటు అయోడిన్ ఎక్కువగా వున్నందువల్ల గాయిటర్ వ్యాధి రాకుండా చేస్తుంది. బెండకాయలను కూరగాయగా, సలాడ్, ఎండబెట్టి వరుగులను తయారు చేయడంలో వాడతారు. వీటి కాండాన్ని కాగితపు పరిశ్రమలో, నారతీయటానికి ఉపయోగిస్తారు. బెండకాయలను క్యానింగ్ చేసి, ఎండబెట్టిన వాటిని ఎత్తయిన ప్రాంతాల్లో వున్న సైనికులకు అవి దొరకని కాలంలో ఎగుమతి చేస్తారు.

**ఉపయోగాలు :**

- లేత బెండ కాయలను వివిధ రకాల వంటల తయారీలో ఉపయోగిస్తారు. వేపుడు గాను, ఉడకబెట్టి సలాడ్ గాను, సూప్‌తోగాని తీసుకుంటారు. బెండ వేర్లు, కాండము నుండి వచ్చిన రసాన్ని చెరకు రసాన్ని శుభ్రపరచడానికి, బెల్లం, చక్కెర పరిశ్రమలలో వాడుతారు.
- టర్కీలో బాగా ముదిరిన గింజలను వేయించి పొడి చేసి "కాఫీ పొడి"కి ప్రత్యామ్నాయంగా వాడతారు.
- ముదిరిన కాండం, కాయల నుండి తీసిన నారను కాగితపు పరిశ్రమలో వాడతారు.
- అంతేగాక ఈ బెండకు కొన్ని ఔషధ గుణాలూ ఉన్నాయి. మూత్ర సంబంధిత, జీర్ణ సంబంధిత వ్యాధుల నివారణకు వాడతారు. టర్కీలో బెండ ఆకుల నుండి తయారు చేసిన మందును కాలిన గాయాల ఉపశమనానికి వాడతారు. దీని జిగురును విరోచనాలను అరికట్టడానికి వాడతారు..

**ప్రస్తుతం బెండ సాగులో ఉన్న సమస్యలు :**

- పల్లాకు తెగులు
- తలనత్త, మొవ్వ, కాయ తొలుచు పురుగు
- హైబ్రిడ్ విత్తనము లభ్యత, అధిక ధర

**నివారణ మార్గాలు :**

పల్లాకు తెగులును తట్టుకునే రకాలను/హైబ్రిడ్స్ సాగు చేయాలి. సమగ్ర సస్యరక్షణ చర్యలు చేపట్టాలి. రైతు స్థాయిలో విత్తనోత్పత్తికి శిక్షణా కార్యక్రమం నిర్వహించాలి. మార్కెటింగ్ నియంత్రణ ఉండేటట్లు చూడాలి.

**వాతావరణం :** వేడి వాతావరణం అనుకూలం. అతి చల్లని వాతావరణం పంట పెరుగుదలకు ప్రతికూలం. పగటి ఉష్ణోగ్రత 25-40 డిగ్రీల సెల్సియస్, రాత్రి 22 డిగ్రీల సెల్సియస్ ఉంటే మొక్క పెరుగుదల బాగుంటుంది. 40 డిగ్రీల సెల్సియస్ కన్నా ఎక్కువైతే పిందె కట్టడం తగ్గి, పూత రాలి, దిగుబడులు తగ్గిపోతాయి. అందువల్ల ఈ పంట వర్షాకాలం, వేసవిలో పండించటానికి అనువైనది.

**నేలలు :** సారవంతమైన నీరు ఇంకే తేలికపాటి నేలలు, మురుగునీరు పోయే సౌకర్యంగల తేలికపాటి నల్లరేగడి నేలలు, గరప నేలలు బెండ



సాగుకు అనుకూలం. గుల్లగా ఉండే సారవంతమైన ఒండ్రు నేలల్లో అధిక దిగుబడి వస్తుంది. నేల ఉదజని సూచిక 6 నుంచి 6.8 వరకు ఉండాలి.

**రకాలు - పూసా సవాని :** పంట కాలం 85-90 రోజులు, కొమ్మలు లేకుండా నిటారుగా 120-180 మీటర్ల ఎత్తు వరకు పెరుగుతుంది. ఒకప్పుడు శంఖు రోగం / పల్లాకు తెగులును బాగా తట్టుకునేది. కానీ ప్రస్తుతం ఈ రకంలో ఈ రోగాన్ని తట్టుకునే గుణం పోయింది. కాయ పొడవు 18-20 సెంటీమీటర్లు. దిగుబడి ఎకరానికి 5-6 టన్నులు.

**పంజాబ్ పద్మిని :** మొక్కలు 180-200 సెం.మీ. పొడవు పెరుగుతాయి. 4-5 కొమ్మలు వస్తాయి. కాండం, కొమ్మలు, ఆకు తొడిమ ఎరుపు రంగులో ఉండి, కాండం, ఆకుల తొడిమల మీద సన్నని నూగు ఉంటుంది. కాయలు 15-20 సెం.మీ. పొడవు వుండి, ఒక్కో కాయ 20-21 గ్రా. తూగుతుంది. కాయలు 3-4 రోజుల వరకు లేతగా ఉంటాయి. ఈ రకం పల్లాకు తెగులు రాకుండా నిరోధించగలుగుతుంది. కొంతవరకు రసం పీల్చే పురుగులు, పత్తి కాయ తొలుచు పురుగు నుండి తట్టుకొని నిలబడుతుంది. దిగుబడి ఎకరానికి 4-5 టన్నులు.

**పర్భని క్రాంతి :** మరట్వాడ వ్యవసాయ విశ్వవిద్యాలయం, పర్భని నుండి విడుదలయిన రకం, ఇది పల్లాకు తెగులును తట్టుకుని అధిక దిగుబడినిచ్చే రకం. మొక్క కొమ్మలు లేకుండా నిటారుగా పెరుగుతుంది. 55 రోజులలో మొదటి కోతకు వస్తుంది. కాయ తొడిమ భాగం గరాటు ఆకారంలో ఉంటుంది. కాయలు 8-9 సెం.మీ. పొడవుతో ముదురాకుపచ్చ రంగులో 5 కణుపులతో ఉంటుంది. కాయలు కోసిన 2-3 రోజుల తర్వాత కూడా లేతగానే ఉంటాయి.

**దిగుబడి :** వేసవికాల పంట దిగుబడి : ఎకరానికి 3.5-4.0 టన్నులు. వర్షాకాలం పంట 4.0-4.5 టన్నులు. దిగుబడిని ఇస్తుంది.

**అర్క అనామిక :** ఇది భారతీయ ఉద్యాన పరిశోధనా సంస్థ బెంగుళూరు నుండి విడుదలయిన రకం, మొక్క 100 సెం.మీ. ఎత్తు వరకు పెరుగుతుంది. తక్కువ కొమ్మలుంటాయి. కాండం మీద కణువులు దగ్గరగా ఉంటాయి. లేత ఎరుపు రంగు మచ్చలు కాండం మీద, ఆకు తొడిమ భాగంలో ఉంటాయి. కొద్దిగా నూగు ఉంటుంది. 55 రోజులలో మొదటి కోతకు వస్తుంది. దిగుబడి ఎకరానికి 4.5-4.6 టన్నులు. పల్లాకు తెగులును బాగా తట్టుకొని అధిక దిగుబడినిస్తుంది. వేసవి పంటకు అనువైనది.

**అర్క అభయ :** ఇది కూడా బెంగుళూరు నుండి విడుదలయిన రకం. ఇది కాయతొలిచే పురుగును, శంఖురోగాన్ని తట్టుకొని అధిక దిగుబడినిస్తుంది. వేసవి పంటకు అనువైనది.

సంకరజాతి కోవకు చెందిన వర్ష, విజయ్, విశాల్, నాథ్ శోభ, మహికో హైబ్రిడ్ నెం. 10,64, ప్రియ, అవంతిక, సుప్రియ, ఐశ్వర్య, మిస్టిక్, యస్. 7109, తులసి, రకాలను, ఎగుమతికి అనువైన పంజాబ్ పద్మిని, వర్ష, విశాల్, నాథ్ శోభ రకాలను సాగు చేసుకోవచ్చు.

**ఎగుమతికి అనువైన రకాలు :** పంజాబ్ పద్మిని, వర్ష, విశాల్, నాథ్ శోభ. సమయం

**విత్తే సమయం :** వాతావరణంలో 17 డిగ్రీల సెల్సియస్‌కన్నా తక్కువ ఉష్ణోగ్రత ఉంటే విత్తనం మొలకెత్తదు. కనీస ఉష్ణోగ్రత 29 డిగ్రీల సెల్సియస్ ఉంటే విత్తనం మొలకెత్తుతుంది. కావున వర్షాకాలంలో జూన్ నెల రెండో వారంలో, వేసవి పంటగా ఫిబ్రవరి రెండో వారంలో వేసుకోవాలి. వర్షాకాలం పంటను జూన్ నుండి జులై, వేసవి పంటను జనవరి రెండవ పక్షం నుండి ఫిబ్రవరి మొదట పక్షం వరకు విత్తుకోవచ్చు. వర్షాకాలంలో ఆలస్యంగా (ఆగస్టులో) విత్తుకుంటే మొక్కలు సరిగ్గా పెరగవు. బూడిద తెగులు ఎక్కువగా ఆశిస్తుంది. వేసవిలో ఆలస్యంగా పంట విత్తితే మొక్క పెరుగుదల తగ్గి, పల్లాకు తెగులు ఎక్కువగా ఆశిస్తుంది

**విత్తన మోతాదు :** ఎకరాకు వర్షాకాలపు పంటకు హెక్టారుకు 8-10 కిలోలు, వేసవి పంటకు హెక్టారుకు 18-20 కిలోలు, సంకరజాతి రకాలకు హెక్టారుకు 5-6 కిలోల విత్తనం కావాలి.

**విత్తన శుద్ధి :** కిలో విత్తనానికి 5 గ్రా. ఇమిడాక్లోప్రిడ్‌తో తర్వాత 4 గ్రా. ట్రైకోడెర్మా విరిడేతో కలిపి విత్తనశుద్ధి చేయాలి.

**విత్తనం - విత్తే పద్ధతి :** నేలను 4-5 సార్లు బాగా దున్నాలి. వర్షాకాలపు పంటను 60 సెం.మీ. ఎడంలో బోదెల మీద 30 సెం.మీ. దూరంలో విత్తుకోవాలి. వేసవి కాలపు పంటను, నేలను మళ్లుగా చేసి వరుసల మధ్య 45 సెం.మీ., మొక్కల మధ్య 15-20 సెం.మీ. దూరం ఉండేటట్లు, విత్తుకోవాలి. విత్తిన వెంటనే నీరు పెట్టి తర్వాత 4-5 రోజులకు రెండవ తడి ఇవ్వాలి. పాదుకు ఒక మొక్క ఉంచి మిగిలినవి తీసివేయాలి.

**పడిపాదులు వేయటం :** ఒక్కో పాదుకు ఒక మొక్క ఉండేటట్లు చూడాలి. మిగిలిన మొక్కలను తీసివేయాలి. దీనినే మెండు తీయటం అంటారు. ఒకవేళ ఖాళీలు ఉంటే ఆ స్థలంలో గింజలు మరలా విత్తుకోవాలి.

**ఎరువులు :** చివరి దుక్కిలో ఎకరాకు 6-8 టన్నుల పశువుల ఎరువును వేసి బాగా కలియ దున్నాలి. 24 కిలోల భాస్వరం, పొటాష్ నిచ్చే ఎరువులను కూడా ఆఖరి దుక్కిలో వేయాలి. 48 కిలోలనిచ్చే నత్రజని

ఎరువును సమభాగాలుగా చేసి 1/3 వ వంతు ఆఖరి దుక్కిలో, మిగిలిన 2/3 వ వంతు రెండు భాగాలుగా విత్తిన 30వ, 45వ రోజున వేయాలి. సంకరజాతి రకాలలో ఎరువుల మోతాదు సుమారు 50 శాతం పెంచివేయాలి.

**జీవన ఎరువులు :** వాతావరణంలో 78% నత్రజని ఉన్నప్పటికి మొక్కలు నేరుగా ఉపయోగించుకోలేవు. కొన్ని రకాల సూక్ష్మజీవులు గాలిలోని నత్రజనిని స్థిరీకరించి, మొక్కలకు అందించి, భూసారాన్ని పెంపొందిస్తాయి. ఈ జీవన ఎరువుల వాడకం వలన ఉత్పత్తి ఖర్చు తగ్గించడమే కాకుండా వాతావరణ కాలుష్యం సైతం తగ్గించవచ్చు.

అజటోబాక్టర్, అజోస్పైరిల్లం వంటి సూక్ష్మజీవులు మొక్క వేళ్ళ ద్వారా విసర్జించే కొన్ని పదార్థాలను, గాలిలోని నత్రజనిని వుపయోగించుకొని పెరుగుతూ, మొక్కకు ఉపయోగపడే హార్మోన్లు తదితర నత్రజని పదార్థాలను విసర్జిస్తాయి. పంటలు ఏపుగా ఆరోగ్యవంతంగా పెరగటానికి ఈ పదార్థాలు ఉపయోగపడతాయి. ఈ జీవన ఎరువులను విత్తనాలకుపట్టించి వాడుకోవాలి. జీవన ఎరువులు ఉపయోగపడాలంటే సేంద్రియ ఎరువులు బాగా వేయాలి.

ఎకరాకు 2 కిలోల అజటోబాక్టర్‌ను 50 కిలోల పశువుల ఎరువుతో కలిపి, నీళ్ళు చల్లుతూ 7-10 రోజులు. మాగనిచ్చి, తర్వాత ఆఖరు దుక్కిలో వేసుకోవాలి. దీనితోపాటుగా ఎకరానికి 2 కిలోల ఫాస్ఫోబాక్టీరియా (పి.యస్.బి.)ను కూడా పొలం అంతా సమంగా చల్లుకోవాలి. ఈ జీవన ఎరువులు వేసుకున్నపుడు సిఫార్సు చేసిన దానిలో 75% నత్రజని, భాస్వరం పూర్తి పొటాష్ వేసుకుంటే సరిపోతుంది.

**కలుపు నివారణ, అంతరకృషి :** పెండిమిథాలిన్ 30% ఎకరాకు 1.2 లీటరు చొప్పున విత్తిన వెంటనేగాని మరుసటి రోజున గాని పిచికారీ చేయాలి. విత్తిన 25, 30 రోజులప్పుడు గొర్రు లేదా గుంటకతో అంతరకృషి చేయాలి. వర్షాకాలంలో మట్టిని ఎగదోసి బోదెలు సరిచేయాలి.



**నీటి యాజమాన్యం :** వర్షాకాలపు పంటకు సకాలంలో వర్షాలు రాకపోతే 7-8 రోజులకొకసారి నీరు పెట్టాలి. వేసవి పంటకు ప్రతి 4-5 రోజులకొకసారి నీరు పెట్టాలి.

**పంటల వరుస క్రమం :** బెండ - ఆలుగడ్డ టమాటో, బెండ పాలకూర పుచ్చకాయ, బెండ - ముల్లంగి కాలిఫ్లవర్ - కీరదోస బెండ - టమాట తోటకూర, బెండ ఆలుగడ్డ సజ్జ క్రమంలో పంట మార్పిడి పాటించాలి.

**కోత కోయటం :** విత్తన 45-50 రోజులకు మొదటి కోత వస్తుంది. కోత మొదలైన తర్వాత ప్రతి 2 రోజులకు ఒకసారి కోయాలి. కాయలు ఆకుపచ్చగా, లేతగా, పీచు పట్టకుండా ఉన్నపుడు కోసినట్లయితే మంచి ధర పలుకుతాయి. పిందె పట్టిన 6-7 రోజుల్లో కోసిన కాయలు మంచి నాణ్యత కలిగి ఉంటాయి. వీలయినంత వరకు కాయలను వెదురు బుటల్లో వదులుగా నింపి నీరు చిలకరించితే, కాయలు గాలి బారి, 2-3 రోజుల్లో వరకు తాజాగా ఉంటాయి. స్థానిక మార్కెట్‌కైతే కాస్త ముదురు, పొడవునా ఉన్న కాయలు కోయాలి. ప్రాసెసింగ్ లేదా విదేశీ ఎగుమతులకైతే బాగా లేతగా ఉన్న ఆకుపచ్చని చిన్న కాయలు (6-8 సెం.మీ. పొడవు) కోయాలి.

**కోత అనంతరం జాగ్రత్తలు :** సాధారణంగా రైతులు రెండు రోజులకొకసారి కోత కోసి బస్తాలలో నింపి మార్కెట్‌కు పంపిస్తారు. జనుము బస్తాలలో బాగా నింపి, కుదించి, బిగ్గరగా కుట్టడం వలన, కాయలు ఒత్తిడికి గురై విరగటం, కాయ రంగు మారటం, దీని వలన కాయ నాణ్యత దెబ్బతింటుంది. అంతేకాక లేత కాయల నుండి తేమ కోల్పోవటం వలన కాయ వడలి. ధర తక్కువ పలుకుతుంది. దీనికి బదులుగా, బెండకాయలను వెదురు గంపలలో వదులుగా నింపటం వలన 2-3 రోజులు కాయ దెబ్బతినకుండా నిలువ వుంటుంది. దిగుబడి ఎకరాకు వర్షాకాలపు పంటకు 3-4 టన్నులు, వేసవి పంటకు 2-2.5 టన్నులు వస్తుంది.

## సస్యరక్షణ - పురుగులు

మొవ్వ, కాయ తొలుచు పురుగు : ఈ పురుగు విత్తిన 30 రోజుల నుండి కోతదశ వరకు ఆశిస్తుంది. మొక్క పెరుగుదల దశలో మొవ్వను, పూత, కాతదశలో కాయలను తొలిచి నష్టం కలిగిస్తుంది. దీని నివారణకు పురుగు ఆశించిన కొమ్మలను పురుగు ఆశించిన ప్రాంతం నుండి ఒక అంగుళం కిందకి తుంచి నాశనం చేయాలి.

**నివారణ :** ఈ పురుగు ఆశించిన కాయలను తుంచి భూమిలో లోతుగా పూడ్చి పెట్టాలి. లేదా తగుల బెట్టాలి. ట్రైకో గ్రామ ఖీలోనిస్ గుడ్లను వదిలితే ఈ పురుగును నివారించవచ్చు. క్రైసోపెర్ల కార్నియని మొదటి లార్వా దశలో హెక్టారుకు సుమారుగా ఒక లక్ష వరకు వదిలి ఉధృతిని తగ్గించవచ్చు. దీపపు ఎరలను హెక్టారుకు 12 చొప్పున పెట్టుకొని తల్లి పురుగుల ఉధృతిని

గమనించుకోవాలి. లింగాకర్షణ బుట్టలను హెక్టారుకు 5 చొప్పున ఏర్పాటు చేసుకోవాలి. బి.టి.ఫార్ములా కలిగిన డైపెల్‌ను 2 గ్రా./లీ. నీటిలో కలిపి పిచికారీ చేయాలి. ఈ పురుగు నివారణకు ఇమామెక్టిన్ బెంజోయేట్ 0.3 మి.గ్రా. లేదా ప్రొఫెనోఫాస్ 2 మి.లీ. లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి.

**దీపపు పురుగులు :** ఆకుపచ్చ రంగులో వుండే చిన్న, పెద్ద పురుగులు ఆకుల భాగాన చేరి రసాన్ని పీల్చి పంటకు నష్టాన్ని కలుగచేస్తాయి. ఆకులు పైకి దోనె మాదిరిగా ముడుచుకొని పోయి పండుబారి రాలిపోతాయి. వీటి నివారణకు డైమిథోయేట్ లేదా ఫిప్రోనిల్ 2 మి.లీ. లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

**ఎర్రనల్లి :** పంట చివరి దశలో చిన్న, సన్నని ఎర్ర పురుగులు ఆకుల అడుగు భాగాన చేరి, ఎక్కువ సంఖ్యలో రసాన్ని పీల్చి వేయడం వల్ల ఆకులు తెల్లగా పాలిపోయి పండుబారి పోతాయి. దీని నివారణకు నీటిలో కరిగే గంధకపు పొడి 3 గ్రా. లేదా డైకోఫాల్ 5 మి.లీ. లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

**తెల్లదోమ :** పంటలో పూతకు ముందు చిన్న, పెద్ద పురుగులు ఆకుల అడుగు భాగాన చేరి రసాన్ని పీల్చి చేయడం వల్ల ఆకులు పసుపు రంగులోకి మారుతాయి. ఇవి శంఖు రోగాన్ని వ్యాప్తి చేస్తాయి. దీని నివారణకు లీటరు నీటికి డైమిథోయేట్ 2 మి.లీ కలిపి 10 రోజుల వ్యవధిలో 2 సార్లు పిచికారీ చేయాలి. తీవ్ర దశలో ఎసిఫేట్ 1.5 గ్రా. లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి. పొలంలో అక్కడక్కడ పసుపు రంగు డబ్బాలకు గ్రీజు గాని, ఆముదం గాని పూసి తెల్లదోమను ఆకర్షింపచేసి నాశనం చేయాలి.

**తెగుళ్ళు - బూడిద తెగులు :** ఆకులపైన అడుగు భాగాన బూడిద వంటి పొడిచే కప్పబడి ఉంటాయి. తేమ తక్కువగా ఉండే పొడి వాతావరణంలో తెగులు తీవ్రత ఎక్కువగా ఉంటుంది. తెగులు ఉధృతి ఎక్కువైతే ఆకులు పచ్చబడి రాలిపోతాయి. దీని నివారణకు 3 గ్రా. నీటిలో కరిగే గంధకపు పొడి లేదా 1 మి.లీ డైనోకాఫ్ లేదా 2 మి.లీ హెక్సాకొనాజోల్ లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి..

**శంఖు/పల్లాకు తెగులు (వై.వి.యం.వి) :** తెగులు సోకిన ఆకుల ఈనెలు పసుపు రంగుకి మారి, కాయలు గిడసబారి, తెల్లగా మారిపోతాయి. దీని నివారణకు తెగులును తట్టుకొనే అర్క అనామిక, అర్క అభయ్ రకాలను విత్తుకోవాలి. లీటరు నీటికి 2 మి.లీ డైమిథోయేట్ లేదా 1.5 గ్రా. ఎసిఫేట్ కలిపి పిచికారి చేయడం ద్వారా తెగులును వ్యాప్తి చేసి తెల్లదోమను అరికట్టవచ్చు. వర్షాకాల పంటను జులై 15కు ముందుగా విత్తటం ద్వారా ఈ తెగులును కొంత వరకు నివారించవచ్చు.

**ఎండు తెగులు :** గింజలు మొలకెత్తినప్పుడు, మొదటి 15 రోజుల సమయంలోనే ఎండిపోయి చనిపోతాయి. దీని నివారణకు విత్తన శుద్ధిలో చెప్పబడిన విధంగా చేయాలి. మొక్కల వద్ద కాపర్ ఆక్సీక్లోరైడ్ 3 గ్రా. లీటరు నీటికి కలిపిన ద్రావణాన్ని పోయాలి. వేప పిండిని ఎకరాకు 100 కిలోల చొప్పున దుక్కిలో వేయాలి. పంట మార్పిడి పాటించాలి. వేసవి ప్రారంభంలో లోతు దుక్కులు చేయాలి. పచ్చిరొట్ట పైరును పెంచి భూమిలో కలియ దున్నాలి.

**సమగ్ర సస్యరక్షణ :** కిలో విత్తనానికి 5గ్రా. చొప్పున ఇమిడాక్లోప్రిడ్ మందును వాడి విత్తన శుద్ధి చేయాలి. ఒక ఎకరాకు 100 కిలోల చొప్పున వేప పిండిని దుక్కిలో వాడాలి. కాయ తొలుచు పురుగుల ఉనికిని గమనించేందుకు లింగాకర్షక బుట్టలను ఎకరానికి నాలుగు చొప్పున అమర్చుకోవాలి. ఎకరానికి నాలుగు చొప్పున పసుపు రంగు పూసిన రేకులను ఆముదం/గ్రీసు పూసి పెట్టి తెల్లదోమను ఆకర్షింపజేయాలి. ఎకరాకు 20 వేల చొప్పున ట్రైకోగ్రాను బదనికలను పూత దశలో వారానికి ఒకసారి చొప్పున నాలుగుసార్లు విడుదల చేయాలి. ఆ సమయంలో పురుగు మందును వాడరాదు. హెచ్.ఎస్.పి.వి., ఎస్.ఎస్.పి.వి.ని ఎకరాకు సమానమైన ద్రావణం పిచికారీ చేయాలి.

రసం పీల్చే పురుగుల నివారణకు ఫాసలోన్, ఫిప్రోనిల్, డైమిథోయేట్ మందుల్లో ఏదైన ఒక మందును లీటరు నీటికి 2 మి.లీ.ల చొప్పున కలిపి పిచికారీ చేయాలి. తెల్ల దోమ నివారణకు 1.5 గ్రా. ఎసిఫేట్ 1 లీ. నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి. కాయతొలుచు పురుగుల నివారణకు థయోడికార్బ్ 1 గ్రా. ఒక లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారి చేయాలి.

**బెండకాయలను నిలువ ఉంచే పద్ధతులు :**

**అ) బెండ వరుగులు తయారీ :** వరుగులు తయారీకి పూసా సవాని అనువైన రకం. బెండకాయ మొత్తంగా లేదా ముక్కలు చేసి లేదా నిలువుగా చీల్చి వరుగులు తయారు చేస్తారు. ముక్కలుగా చేస్తే పావు అంగుళం మందంగల ముక్కలు చేయాలి. బెండ కాయలు నిలువుగా చేసిన ముక్కలు లేదా అడ్డంగా చేసిన ముక్కలను మరిగే నీళ్ళలో 4-8 నిమిషాలు ఉంచాలి లేదా 2-5 నిమిషాలు నీటి ఆవిరి మీద వుంచాలి. ఆ తర్వాత తీసి, జిగురంతా పోయేటట్లు చల్లని నీళ్ళు పోయాలి. ఆ తర్వాత ఈ ముక్కలను 145-155 డిగ్రీల ఉష్ణోగ్రత వద్ద 6-8 గంటలు ఎండనివ్వాలి. 12 కిలోల బెండ ముక్కలను ఈ విధంగా చేసి ఎండబెడితే ఒక కిలో పరుగులు తయారవుతాయి.

**వరుగులు నిలువ చేయు విధానం :** నిలువలో కీటకాల బారి నుండి కాపాడటానికి, తయారయిన వరుగులను మరల 130-150 ఉష్ణోగ్రత వద్ద ఎండ బెట్టాలి. ఆ తర్వాత పరిశుభ్రమైన గాలి చొరబడని డబ్బాలలో నిలువ చేయాలి. ఈ డబ్బాలలో తేమ, సన్నని కీటకాలు లోనికి చేరకుండా డబ్బా లోపలి భాగం మైనం పేపరుతో లైనింగ్ వుండేటట్లు చూడాలి. ఈ డబ్బాలలో ఎండిన పరుగులు వేశాక, గట్టిగా ప్యాక్ చేసే ముందు నైట్రోజన్ గ్యాస్తో నింపితే నాణ్యత బాగుంటుంది.

**ఆ) క్యానింగ్ :** పూసా సవాని లేదా పొట్టిగా ఆకుపచ్చగా ఉన్న రకాలు క్యానింగ్‌కు అనుకూలం.

**తయారు చేయు విధానం :** లేత ఆకుపచ్చ బెండ కాయలను అలాగే కానీ లేదా ముక్కలుగా చేసి మరిగే వేడి నీళ్ళలో 1-2 నిమిషాలుంచి తీసి వెంటనే 1.5% ఉప్పు ద్రావణంలో వేసి 10 నిమిషాలుంచి చల్లబరచాలి. ఈ విధంగా చేసిన ముక్కలను 2% ఉప్పు ద్రావణంలో ఉంచి డబ్బాలలో నింపి ప్యాక్ చేయాలి.

# వేసవిలో ఆకుకూరల సాగు విధానం



కొత్త సుష్మా
(పిహెచ్.డి స్కాలర్, విజిటబుల్ సైన్స్)
బందెల సంతోష
(పిహెచ్.డి స్కాలర్, విజిటబుల్ సైన్స్)
ఉద్యాన కళాశాల, రాజేంద్రనగర్

మన ఆరోగ్యానికి ప్రధానంగా కావలసిన ప్రోటీన్లు, విటమిన్లు ఎ – సి, ఇనుము, కాల్షియం, ఫాస్పరస్ వంటి ఖనిజ లవణాలను అందించేవి ఆకుకూరలు. ఆహార సమతుల్యతలో వీటిది ప్రధాన పాత్ర. రోజుకు కనీసం 116 గ్రాముల ఆకుకూరలు తినాలని ఆహార నిపుణులు సూచిస్తున్నారు.

ఆకుకూరల్లో ముఖ్యంగా గోంగూర, తోటకూర, పాలకూర, మెంతికూర, కొత్తిమీర, పుదీనా, బచ్చలి.. సీజన్‌తో సంబంధం లేకుండా వీటిని ఏడాది పొడవునా లాభసాటిగా పండించవచ్చు. వేసవిలోని అధిక ఉష్ణోగ్రతలు, వేడిగాలుల వల్ల భూమిలో తేమ ఆవిరై పోతుంది. ఫలితంగా మొక్కలు వడలిపోతాయి. అయితే కొద్దిపాటి మెలకువలు పాటించి వేసవిలోనూ ఆకుకూరలు సాగు చేస్తూ అధిక లాభాలు పొందొచ్చు. వేసవిలో సాగు నీటి సమస్య ఉంటుంది. కావున తేమ నిలుపుకోగలిగిన బరువైన నేలలు ఆకుకూరల సాగుకు అనుకూలంగా ఉంటాయి. నీటి వసతి ఉంటే ఎర్ర భూములు, ఇసుక నేలలను ఎంపిక చేసుకుంటే సత్ఫలితాలు ఉంటాయి. ముఖ్యంగా వేసవిలో ఆకుకూరల సాగుకు సూచించిన రకాలను ఎంపిక చేసుకుంటే నీటి ఎద్దడిని తట్టుకుని మంచి దిగుబడులు వస్తాయి.

**ఇందులోని రకాలు ఇవీ..**

**తోటకూర :** ఆర్ఎన్ఏ – 1, ఆర్కా, సుగుణ

**పాలకూర :** ఆల్‌గ్రీన్, పూసా పాలక్, పూసా జ్యోతి

**మెంతికూర :** పూసా ఎర్లీ బంచింగ్

**కొత్తిమీర :** సాధన, స్వాతి

**గోంగూర :** ఎర్ర గోంగూర

**బచ్చలి :** మట్టుబచ్చలి, తీగ బచ్చలి

**పుదీనా :** జపనీస్‌మింట్, పెప్పర్‌మింట్

**విత్తన మోతాదు- విత్తే దూరం**

**తోటకూర :** 900 –1000 ఎకరం విత్తనం, పది కిలోల ఇసుకతో చల్లాలి.

**పాలకూర :** 12–15 కిలోల విత్తనం, 2'10 సెంటీమీటర్లు ఎడంలో విత్తుకోవాలి

**మెంతికూర :** 10–12 కిలోల విత్తనం, పొడవు 20–25 సెంటీమీటర్లు, వెడల్పు 7.5 సెంటీమీటర్లతో ఒత్తుగా విత్తుకోవాలి.

**కొత్తిమీర :** ఎకరానికి ఐదారు కిలోల విత్తనాన్ని 15 సెంటీమీటర్ల ఎడంతో విత్తుకోవాలి.

**గోంగూర :** 6–8 కిలోల విత్తనాన్ని 60 సెంటీమీటర్ల ఎడంతో తయారు చేసుకున్న బోదెల్లో 30 సెంటీమీటర్ల దూరంతో వరుసల్లో విత్తాలి.

**బచ్చలి :** ముందుగా నారు పోసుకుని 2–3 ఆకుల దశలో 50 సెంటీమీటర్ల ఎడంలో నాటుకోవాలి. తీగబచ్చలి 60–30 సెంటీమీటర్ల ఎడంతో నాటుకోవాలి.

**పుదీనా :** కాండం ముక్కలను 30'45 సెంటీమీటర్ల ఎడంతో నాటుకోవాలి.

**ఎరువుల యాజమాన్యం :** ఆఖరి దుక్కిలో ఎకరానికి 10–15 టన్నుల పశువుల ఎరువు, 200 వేపపిండి వేసి కలియదున్నాలి. వీలైనంత ఎక్కువగా సేంద్రియ ఎరువులతోపాటు జీవన ఎరువులు వినియోగిస్తే ప్రయోజనం

**నీటి యాజమాన్యం :** ఆకుకూరలను విత్తిన వెంటనే నీరు పెట్టాలి. మళ్లీ మూడో రోజు నీళ్లు పెట్టి నేలల స్వభావాన్ని తర్వాత పైపాటు ఎరువులు చల్లి నీటి తడి అందించాలి.

**కలుపు నివారణ :** పెండిమెథాలన్ 1.2 లీటర్లు 200 లీటర్ల నీటిలో కలిపి విత్తిన 24 గంటల్లో పొలానికి పిచికారీ చేసి 30 రోజుల వరకూ కలుపు నివారించుకోవచ్చు.

**సస్యరక్షణ :** ముఖ్యంగా ఆకుముడత, రసం పీల్చే పురుగులు, గొంగళి పురుగులు, తప్పు ఆకుమచ్చ తెగుళ్లు ఆకుకూరలను ఆశిస్తాయి. ఆకుకూరల్లో పురుగు, తెగుళ్ల మందులు వాడకపోవడమే మంచిది. ఒక వేళ మరీ ఉధృతంగా ఉన్నప్పుడు పురుగుల నివారణ కోసం మలాథియాన్ 2 మిల్లీలీటర్లు ఒక లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి. తెగుళ్ల నివారణకు కార్బండిజమ్ 1 గ్రాము లీటరు నీటికి లేదా మాంకోజెబ్ 2.5 గ్రాములు లీటరు నీటిలో కలిపి పిచికారీ చేయాలి. వేసవిలో ఆకుకూరలు వేడిమికి తట్టుకోలేవు. కాబట్టి నీడనిచ్చే మొక్కజొన్న, ఆముదం వంటి పంటలను ఉత్తర, దక్షిణ దిశల్లో నాటుకుంటే మంచిది.

# చదువుకుంటూ వ్యవసాయం




తిరువనంతపురంలోని అట్టింగల్‌కు చెందిన శివప్రియ, హరిప్రియ అక్కచెల్లెళ్లు. ఇద్దరూ చదువుకుంటూ, ఐదేళ్ల నుంచి వ్యవసాయం చేస్తున్నారు. రకరకాల పంటలు పండిస్తూ కుటుంబానికి ఆర్థికంగా అండగా నిలుస్తున్నారు.

శివప్రియ, హరిప్రియ తల్లిదండ్రులు పేద కుటుంబీకులు. పనిచేసుకుంటేనే ఇల్లు గడిచే పరిస్థితి. పిల్లలిద్దర్నీ చదివించడం కష్టమైంది. తండ్రి తెచ్చే కూలీ డబ్బులు నెలంతా సరిపోయేవి కావు. ఆ సమయంలో వారి ఇంటి దగ్గర్లో 10 సెంట్ల బీడు భూమి ఉంది. అది పిచ్చిచెట్లతో ఉండేది. తినడానికి, ఇల్లు గడవడానికి కష్టంగా వున్న రోజుల్లో ఆ స్థలాన్ని బాగుచేసి, పత్తి మొక్కలు, చిక్కుడు పాదులు, పొట్లకాయ, క్యాలీఫ్లవర్, దోస, క్యాబేజీ, టమాటా, పుదీనా, కొన్ని కూరగాయల మొక్కలు వేశారు. ఉదయాన్నే లేచి శివప్రియ, హరిప్రియ మొక్కలకు నీళ్లు పెట్టడం, కలుపు తీయడం చేసేవారు. తర్వాత స్కూలుకి వెళ్లేవారు. కూరగాయలు పండటం, అందరూ ఇంటికి వచ్చి వాటిని కొనుగోలు చేయడంతో వారికి ఆర్థికంగా లాభం అనిపించింది. దాంతో తండ్రి కూడా ఆ తోటలో పనిచేయడం ప్రారంభించారు. ఆ మొక్కలకు ఎరువుల కోసం కోళ్ల ఎరువు, కూరగాయల వ్యర్థాలు, మేకల ఎరువు కలిపిన మట్టిని సంచుల్లో వేసి మొక్కలను పెంచేవారు.

అక్కచెల్లెళ్ల కష్టాన్ని, వ్యవసాయం పట్ల వారి ఇష్టాన్ని చూసి, ఇరుగుపొరుగు రైతులు వారికి 80 సెంట్ల భూమిని ఇచ్చారు. దాంట్లో కూరగాయలు సాగు చేసుకోమని ప్రోత్సహించారు. కుటుంబం మొత్తం ఆ భూమిని సాగుచేసి, ఆకుకూరలు, కూరగాయలు పండించి అమ్ముతున్నారు. కుటుంబం కష్టాల్లో ఉన్నప్పుడు ఈ అక్కచెల్లెళ్లు కుటుంబ బాధ్యతను తమ భుజాలకు ఎత్తుకుని వ్యవసాయం చేయడం స్థానికులకు ఆశ్చర్యం కలిగించింది. 'రెండేళ్ల క్రితం రాష్ట్రంలో సంభవించిన తుఫాను కారణంగా పంట మొత్తం దెబ్బతిన్నది. ప్రతి రైతుకి ప్రకృతి వైపరీత్యాల కారణంగా నష్టపోవడం తప్పదు. ఆ సమయంలో కుటుంబం ఇబ్బంది పడకుండా మేము కూరగాయలు అమ్మి, సంపాదించిన డబ్బు ఉపయోగపడింది' అని అంటున్నారు ఈ అక్కాచెల్లెళ్లు.

### సేంద్రీయ ఎరువులను ఉపయోగించి

6,7 తరగతి చదువుతున్న వీరికి వ్యవసాయం అంటే పూర్తిగా అవగాహన లేని వయస్సు. అప్పటి నుంచే వ్యవసాయం చేస్తున్నారు. సేంద్రీయ పద్ధతిలో వ్యవసాయం చేయాలనుకుని ఆన్‌లైన్ ద్వారా వ్యవసాయ సంఘం సభ్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ పచ్చిలా కషాయం, వెలుతుల్లి కషాయం వంటి సేంద్రీయ ఎరువులను తయారుచేస్తున్నారు. మొక్కల పోషక సమతుల్యతను, ఆరోగ్యకరమైన పెరుగుదలకు కృషి చేశారు. ఒక పక్క వ్యవసాయం చేస్తూ, కూరగాయలు అమ్ముతున్న శివప్రియ, హరిప్రియలు ప్రస్తుతం ఇంటర్ ఫస్ట్, సెకెండీయర్ చదువుతున్నారు. ఈ యువ రైతుల విజయాన్ని గుర్తించి, పంచాయతీ నుంచి 'కుట్టి కర్షక అవార్డు' ను అందజేశారు వ్యవసాయ అధికారులు.






### మిర్చి రైతులకు రూ.లక్ష చొప్పున పరిహారమివ్వాలి

**జంగారెడ్డిగూడెం :** తామర పురుగు వైరస్ తెగుళ్లతో నష్టపోయిన మిర్చి రైతులకు ఎకరానికి రూ.లక్ష నష్ట పరిహారం ఇవ్వాలని, వ్యవసాయానికి కరెంటు కోతలు ఆపాలని డిమాండ్ చేస్తూ ఎపి రైతు సంఘం, వ్యవసాయ కార్మిక సంఘం ఆధ్వర్యంలో జంగారెడ్డి ఆర్డీవో కార్యాలయం వద్ద ఫిబ్రవరి 7న రైతులు ధర్నా నిర్వహించారు. ఈ సందర్భంగా రైతు సంఘం జిల్లా కార్యదర్శి కె.శ్రీనివాస్ మాట్లాడారు. అనంతరం ఆర్డీవోకు వినతిపత్రం సమర్పించారు. వ్యవసాయ కార్మిక సంఘం జిల్లా సహాయ కార్యదర్శి ఎం. జీవరత్నం, రైతు సంఘం జిల్లా సహాయ కార్యదర్శి రాంబాబు తదిరతులు, రైతులు పాల్గొన్నారు.

### పరిహారమిప్పించాలని తహశీలు'కు వినతి

**పెదకాకాని :** మిర్చికి తామ పురుగు, ఇతర వైరస్ సోకిన కారణంగా పంట పూర్తిగా దెబ్బతిన్నదని, నష్టపరిహారంగా ఎకరానికి రూ.లక్ష ఇప్పించాలని కోరుతూ గుంటూరు జిల్లా పెదకాకాని తహశీలుదారుకు వినతిపత్రం ఇచ్చారు. ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం జరిగింది. అంతకుముందు మిర్చి పొలాలను రైతు సంఘం నాయకులు పరిశీలించి వచ్చారు. ఈ కార్యక్రమంలో రైతు సంఘం జిల్లా కార్యదర్శి జొన్నా శివశంకరరావు, అప్పిరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### తగులబెట్టిన వరికుప్పలకు పరిహారమివ్వాలి

**దెందులూరు :** వరికుప్పలు తగులబెట్టడంతో నష్టపోయిన పశ్చిమగోదావరి జిల్లా దెందులూరు మండలం ఉండ్రాజవరం కౌలు రైతు కొల్లి విజయ భాస్కరరెడ్డికి నష్ట పరిహారం ఇచ్చి ఆదుకోవాలని కోరుతూ ఎపి రైతు సంఘం, ఎపి కౌలు రైతు సంఘం ఆధ్వర్యంలో ఫిబ్రవరి 9న దెందులూరు తహశీలుదారు కార్యాలయం వద్ద రైతులు ఆందోళన చేపట్టారు. ఐదున్నర ఎకరాల వరికుప్పలను దుండగులు దగ్ధం చేశారని, రూ.మూడున్నర లక్షలు నష్టపోయారని, రైతులకు ప్రభుత్వం నష్టపరిహారం ఇప్పించాలని డిమాండ్ చేశారు. ఎపి రైతు సంఘం జిల్లా కార్యదర్శి కె.శ్రీనివాస్ తదిరత నేతలు పాల్గొన్నారు.

### మిర్చి రైతుల ఆందోళన

**వీరులపాడు :** మిర్చికి తెగుళ్లు, పచ్చ పురుగు కారణంగా పంట దెబ్బతిని రైతులు తీవ్రంగా నష్టపోయినందున ప్రభుత్వం బాధిత రైతులను ఆదుకోవాలని కోరుతూ కృష్ణాజిల్లా వీరులపాడు మండలం జుజ్జూరు గ్రామంలో రైతులు ఆందోళన నిర్వహించారు. మిర్చికి తెగుళ్ల కారణంగా కనీస పెట్టుబడి కూడా రానందున రైతులను ఆదుకోవాలని, ఆత్మహత్యలు చేసుకునే పరిస్థితులు ఏర్పడే ప్రమాదముందని, అందువల్ల నష్టపరిహారమిచ్చి రైతులను ఆదుకోవాలని కోరారు.

### వైరస్ సోకిన మిర్చి పొలాల పరిశీలన

**పిడుగురాళ్ల :** వైరస్ తెగుళ్ల కారణంగా నష్టపోయిన మిర్చి రైతులను తక్షణమే ఆదుకోవాలని రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు వి.కృష్ణయ్య డిమాండ్ చేశారు. ఫిబ్రవరి 7న గుంటూరు జిల్లా పిడుగురాళ్ల మండలంలో తెగుళ్లబారిన పడిన మిర్చి పొలాలను రైతు సంఘం బృందం పరిశీలించింది. గతేడాదికన్నా ఈయేడు ఎక్కువగా మిర్చి సాగు చేశారని, తామర పురుగు, నల్లి కారణంగా పంట పూర్తిగా దెబ్బతిని రైతాంగం దిక్కుతోచని స్థితిలో పడిపోయిందన్నారు. ఈ కార్యక్రమంలో ఏపూరి గోపాలరావు, తదితర నాయకులు పాల్గొన్నారు.

### పెసర, మినుము కొనుగోళ్లకు కేంద్రాలు పెట్టాలి

**విజయనగరం :** జిల్లాలో పెసర, మినుము పంట మార్కెట్లో మద్దతు ధర కన్నా రూ.వెయ్యికి తగ్గించి అమ్ముకోవాల్సి వస్తోందని, కనుక మార్క్‌ఫెడ్ ద్వారా కొనుగోలు కేంద్రాలను ఏర్పాటు చేయాలని విజయనగం జిల్లా కలెక్టరుకు ఎపి రైతు సంఘం జిల్లా కమిటీ విజ్ఞప్తి చేసింది. పంట పూర్తి స్థాయిలో రైతు చేతికి వచ్చే సమయానికి మార్కెట్‌లో ధర మరింత తగ్గించే ప్రమాదమున్నందున తక్షణమే రైతుకు మద్దతు ధర కల్పించేలా మార్క్‌ఫెడ్ ద్వారా కొనుగోలు కేంద్రాలను ఏర్పాటు చేయాలని కలెక్టరుకు ఇచ్చిన వినతిపత్రంలో కోరారు. ఎపి రైతు సంఘం రాష్ట్ర కార్యదర్శి మర్రాపు సూర్యనారాయణ, జిల్లా కార్యదర్శి చల్లా జగన్, ఉపాధ్యక్షులు ఆదినారాయణమూర్తి తదితరులు పాల్గొన్నారు.

### నంద్యాలలో రైతు సంఘం జిల్లాస్థాయి వర్క్‌షాపు

**నంద్యాల :** కర్నూలు జిల్లా నంద్యాలలోని నరసింహయ్య భవన్‌లో ఎపి రైతు సంఘం జిల్లాస్థాయి వర్క్‌షాప్ జరిగింది. జిల్లా అధ్యక్షులు టి.రమేష్‌కుమార్ అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథిగా ఎపి రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు పి.నరసింహారావు పాల్గొని మాట్లాడారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రైతులకు సంబంధించిన సమస్యలను

పరిష్కరిస్తామని చెప్పి ఆచరణకు నోచుకోవడం లేదన్నారు. సీడ్స్ కంపెనీలు రైతులను నట్టేట ముంచాయన్నారు. ఈ సమస్యలపై 14న జరిగే ఆందోళనల్లో పెద్దఎత్తున పాల్గొనాలని కోరారు. జిల్లా కార్యదర్శి రాజశేఖర్ తదితర జిల్లా నాయకులు పాల్గొన్నారు.

## గిరిజన రైతుల భూములకు పట్టాలు ఇవ్వాలి

**మందస :** గిరిజనుల భూములకు పట్టాలు మంజూరు చేయాలని ఎపి రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి కె. మోహనరావు డిమాండ్ చేశారు. గిరిజనుల భూమలు అన్యాక్రాంతమవుతున్నాయని విమర్శించారు. రియల్ ఎస్టేట్ వ్యాపారులు గోపాల్ సాగర్‌కు రావాల్సిన నీటి చానల్‌ను మూసివేశారని విమర్శించారు. భూ ఆక్రమణలపై అధికారులు చోద్యం చూస్తున్నారని, అక్రమితులపై చర్యలు తీసుకోవాలని, గిరిజనులకు పట్టాలు ఇవ్వాలని డిమాండ్ చేశారు. అంతకుముందు గిరిజన రైతు బృందం మేఘమాల, సువ్వాగాం, చిన్న బరంపురం ప్రాంతాల్లో ఆక్రమిత భూములను పరిశీలించింది.

## తాడికొండ మండలంలో ప్రచారం

**తాడికొండ :** మిర్చి రైతులకు న్యాయం చేయాలని కోరుతూ గుంటూరు కలెక్టరేట్ వద్ద జరిపే దీక్షల్లో పాల్గొనాలని తాడికొండ మండలంలోని గ్రామాల్లో రైతు కార్యకర్తలు ప్రచారం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో రైతు సంఘం జిల్లా అధ్యక్షుడు కంచుమాటి అజయ్‌కుమార్, కౌలు రైతు సంఘం జిల్లా కార్యదర్శి బైరగాని శ్రీనివాసరావు తదితర మండల నాయకులు పాల్గొన్నారు.

## వడ్డేశ్వరంలో రైతు సంఘ విస్తృత సమావేశం

**తాడేపల్లి :** తాడేపల్లి మండలం వడ్డేశ్వరంలోని రైతు సంఘం రాష్ట్ర కార్యాలయంలో ఎపి రైతు సంఘ విస్తృత సమావేశం జరిగింది. గుంటూరు జిల్లా అధ్యక్షులు కె. అజయ్‌కుమార్ అధ్యక్షత వహించారు. రాష్ట్ర అధ్యక్షులు వై. కేశవరావు మాట్లాడారు. వ్యవసాయ విద్యుత్తుకు మీటర్లు బిగించేందుకు కేంద్ర ప్రభుత్వం పూనుకుందని దీనివల్ల వ్యవసాయ రంగం పూర్తిగా దెబ్బతిని రైతులు నష్టపోయే ప్రమాదముందన్నారు. రాష్ట్ర ఉపాధ్యక్షులు వి. కృష్ణయ్య మాట్లాడుతూ రైతులు ఎదుర్కొంటున్న సమస్యలపై గ్రామగ్రామాన ప్రచారం నిర్వహించాల్సిన ఆవశ్యకతపై మాట్లాడారు. జిల్లా కార్యదర్శి జొన్నా శివశంకరరావు తదితర జిల్లా నాయకులు పాల్గొన్నారు.

## విద్యుత్తు సరఫరాను సక్రమంగా ఇవ్వాలని ఆందోళన

**జీలుగుమిల్లి :** విద్యుత్తు సరఫరాను సక్రమంగా ఇవ్వాలని కోరుతూ రైతులు పశ్చిమగోదావరి జిల్లా జీలుగుమిల్లి మండలం నారాయణపురం 33/11 కెవి విద్యుత్తు ఉప కేంద్రం వద్ద బైఠాయించి ఫిబ్రవరి 15న ఆందోళన చేపట్టారు. పంట పొలాలకు సక్రమంగా విద్యుత్తు సరఫరా చేయాలని డిమాండ్ చేశారు.

## గుంటూరు కలెక్టరేట్ వద్ద నిరాహారదీక్షలు

**గుంటూరు :** వైరస్ తెగులు వల్ల నష్టపోయిన మిర్చి రైతులను ఆదుకోవాలని కోరుతూ ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం ఆధ్వర్యంలో గుంటూరు జిల్లా కలెక్టరు కార్యాలయం ఎదుట రైతుల సామూహిక దీక్షలు నిర్వహించారు. శాసనమండలి సభ్యులు కె.ఎస్.లక్ష్మణరావు, రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.కేశవరావు, కౌలు రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.రాధాకృష్ణ, నాయకులు జొన్నా శివశంకర్, కంచుమాటి అజయ్‌కుమార్, ఏపూరి గోపాలరావు కామినేని రామారావు, బైరగాని శ్రీనివాసరావు తదితరులు ప్రసంగించారు.

## పెంచికలపాడు హైవేపై రాస్తారోకో

**గూడూరు :** కావేరి కంపెనీ విత్తనాల వల్ల నష్టపోయిన రైతులకు నష్టపరిహారం ఇవ్వాలని, నకిలీ విత్తనాలు సరఫరా చేసి రైతులను మోసం చేసిన కావేరి కంపెనీపై తక్షణమే చర్యలు తీసుకోవాలని ఫిబ్రవరి 14న కర్నూలు జిల్లా గూడూరు మండలం పెంచికలపాడు హైవే వద్ద రాస్తారోకో నిర్వహించారు. పెద్దఎత్తున రైతులు పాల్గొన్నారు.

## కావేరి కంపెనీలపై చర్య తీసుకోవాలని రాస్తారోకోలు

**నంద్యాల :** జాదు కావేరి కంపెనీల కల్తీ విత్తనాల వల్ల నష్టపోయిన రైతులందరికీ ఎకరానికి లక్ష రూపాయల నష్టపరిహారం చెల్లించాలని, సదరు కంపెనీలపై తగు చర్యలు చేపట్టాలని, కర్నూలు జిల్లా నంద్యాల ప్రాంతంలోని మూడు తాలూకా కేంద్రాల్లో రాస్తారోకో కార్యక్రమాలు జరిగాయి. ఈ కార్యక్రమంలో 180 మంది రైతులు పాల్గొన్నారు.

## పంటల నష్టపై వినతిపత్రం

**కౌతాళం :** మండలంలో గతేడాది మే నెలలోనే వర్షాలు రావడం వల్ల రైతులు విత్తనాలు వేశారు. అయితే పంట కాపుదశలో వర్షాలు పడకపోవడంతో పంటలు పూర్తిగా ఎండిపోయాయి. దీంతో రైతులు దివాళా తీసి అప్పులు పాలై వలసలు పోయారు. ఈ స్థితిలో మిరప రైతులకు ఎకరానికి రూ.50 వేలు, మిగతా పంటలు వేసిన వారికి ఎకరానికి రూ.30 వేలు ఇవ్వాలని కోరుతూ కౌతాళం తహశీలుదారుకు వినతిపత్రం ఇచ్చారు. రైతు సంఘం నాయకులు ఈరన్న, ఉలిగయ్య, యువరాజు, అల్లమ్మ, వెంకటేష్, వీరేష్ తదితరులు పాల్గొన్నారు.

## రైతు సంఘం పశ్చిమగోదావరి జిల్లా విస్తృత సమావేశం

**ఏలూరు :** ఎపి రైతు సంఘం ప.గో.జిల్లా స్థాయి విస్తృత సమావేశం ఏలూరులో గుత్తికొండ వెంకటకృష్ణారావు అధ్యక్షతన జరిగింది. ముఖ్యఅతిథిగా సంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.కేశవరావు హాజరయ్యారు. జిల్లాలోని రైతాంగ సమస్యలను చర్చించి పలు తీర్మానాలు చేశారు. వ్యవసాయ పంపుసెట్లకు మీటర్ల బిగింపుపై పోరాటాలు చేయాలని, విద్యుత్తు సవరణ బిల్లుకు వ్యతిరేకంగా పోరాడాలని తీర్మానించారు. ఇంకా సంఘం జిల్లా కార్యదర్శి కె.శ్రీనివాస్ కూడా పాల్గొన్నారు.

## ఐదు మండలాల్లో ధర్నాలు

**ఆదోని :** మిర్చి రైతులకు న్యాయం చేయాలని ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో ఫిబ్రవరి 14న నంద్యాల ప్రాంతంలో ఐదు మండలాల్లో ధర్నాలు జరిగాయి. ఆదోనిలో 130 రైతులు, మంత్రాలయంలో 50 మంది రైతులు, ఎమ్మిగనూరులో 45 మంది రైతులు, నందవరంలో 70 మంది రైతులు, గోనెగండ్లలో 23 మంది రైతులతో ధర్నాలు జరిగాయి.

## విద్యుత్తు సబ్ స్టేషన్ల వద్ద ధర్నాలు

**ఏలూరు :** వ్యవసాయ విద్యుత్తు కోతలకు నిరసనగా పశ్చిమగోదావరి జిల్లా జీలుగుమిల్లి మండలం పి.నారాయణపురం విద్యుత్తు సబ్ స్టేషను వద్ద రైతులు ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో ధర్నా నిర్వహించారు. అలాగే కామవరపుకోట గ్రిడ్ సబ్‌స్టేషన్ వద్ద రైతులు పెద్ద ఎత్తున ధర్నా నిర్వహించారు. విద్యుత్తు అధికారులు వచ్చే వరకూ నిరసన చేపట్టారు. విద్యుత్తు శాఖ డిఇ అంబేద్కర్ రైతుల వద్దకు వచ్చి సమస్యలను పరిష్కరిస్తామని హామీ ఇచ్చారు. నిరసనలో రైతులు పాల్గొన్నారు.

## సాగునీటి కోసం రాస్తారోకో

**ఉరవకొండ :** హంద్రీనీవా నీరు అర్థాంతరంగా నిలిపివేయడంపై ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో అనంతపురం జిల్లా ఉరవకొండలో రాస్తారోకో నిర్వహించారు. హంద్రీనీవా నీరు అర్థాంతరంగా నిలిపివేయడం వల్ల 25 వేల ఎకరాల్లో పంటల పరిస్థితి ప్రశ్నార్థకంగా మారిందని, ఎండిపోతున్న పొలాలను నీరిచ్చి కాపాడాలని కోరుతూ రైతులు ఈ రాస్తారోకో నిర్వహించారు. ఇదే సమస్యపై అమరావతిలో ఇరిగేషన్ అధికారికి ఎపి రైతు సంఘం రాష్ట్ర అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు వై.కేశవరావు, మర్రాపు సూర్యనారాయణ వినతిపత్రం ఇచ్చారు. ఎపి కౌలు రైతు సంఘం ఉపాధ్యక్షులు వి.శ్రీనివాసరావు కూడా ఉరవకొండ మండల పరిధిలోని ఇంద్రావతి, మోపిడి గ్రామాల ప్రాంతాల్లో అక్విడెక్ట్‌ను పరిశీలించారు. రైతులతో మాట్లాడి వారి సమస్యలను తెలుసుకున్నారు.

## ఎండిపోతున్న వేరుశనగ పంటల పరిశీలన

**ఉరవకొండ :** ఎండిపోతున్న వేరుశనగ పంట పొలాలను కౌలు రైతు సంఘం ఉపాధ్యక్షులు వి.శ్రీనివాసరావు పరిశీలించారు. చిన్నముష్టూరు గ్రామానికి చెందిన ఎర్రిస్వామి, కొర్రపాటి హనుమంతు, బోధపాటి గోపాల్‌కు చెందిన పొలాలను రైతు సంఘం నాయకులతో కలిసి పరిశీలించారు. రైతు సంఘం నాయకులు రాంభూపాల్, ఇంకా బాలరంగయ్య, జ్ఞానమూర్తి తదితరులు పాల్గొన్నారు.

## బాధిత మిర్చి రైతుల రాస్తారోకో

**ఎ.కొండూరు :** అఖిలపక్ష కౌలు రైతు సంఘాల ఆధ్వర్యంలో కౌలు రైతులు చింతలపాడు సెంటర్‌లో రాస్తారోకో నిర్వహించారు. మిర్చి వేసి ఈ ఏడాది తీవ్రంగా నష్టపోయామని, రైతులను ఆదుకోవాలని కోరుతూ ఈ రాస్తారోకో చేపట్టారు. అనంతరం అక్కడ నుండి ర్యాలీగా సచివాలయం వద్దకు వెళ్లి ధర్నా నిర్వహించారు. ఈ కార్యక్రమంలో అఖిలపక్ష రైతు సంఘాల నాయకులు అమ్మిరెడ్డి, ఎం.ప్రభాకరరావు, శ్రీనివాసరావు, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

## వ్యవసాయ పంపుసెట్లకు మీటర్ల పరిశీలన

**సికె దిన్నె :** కడప జిల్లా సికె దిన్నె మండలంలో వ్యవసాయ బోర్లకు మీటర్లు అమర్చడాన్ని ఎపి రైతు సంఘం కడప జిల్లా ఆధ్వర్యంలోనాయకులు పరిశీలించారు. మండలంలోని రసూల్ పల్లె, కొలుముల పల్లె పంచాయతీల్లో రైతుల పంపుసెట్లను పరిశీలించారు. ఈ సందర్భంగా రైతు సంఘం జిల్లా కార్యదర్శి దస్తగిరిరెడ్డి మాట్లాడుతూ.. వ్యవసాయదారులు ఇప్పటికే పెరిగిన విత్తనాలు, ఎరువులు, పురుగుమందుల ధరలతో సతమతమవుతుండగా.. ఈ తరుణంలో పంపుసెట్టకు మీటర్లు బిగించి బిల్లులు వసూలు చేయడం సరైంది కాదన్నారు. ఈ పరిశీలనా కార్యక్రమంలో నాయకులు గోపాలకృష్ణయ్య, చిన్న సిద్ధయ్య, సుబ్బారెడ్డి పాల్గొన్నారు.

## పంట నష్టపోయిన మిర్చి రైతులను ఆదుకోవాలి

**మైలవరం :** తెగులు వల్ల పంట నష్టపోయిన రైతులను తక్షణమే ఆదుకోవాలని కోరుతూ కృష్ణాజిల్లా మైలవరం బోసుబొమ్మ సెంటరులో ధర్నా నిర్వహించారు. ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి పి.వి.ఆంజనేయులు మాట్లాడుతూ.. ఎకరానికి లక్ష నుంచి రెండు లక్షల రూపాయలు పెట్టుబడిగా పెట్టి తెగుళ్లతో మిర్చి రైతులు నిలువునా మునిగిపోయారని అన్నారు. వారిని ప్రభుత్వం ఆదుకోవాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో వివిధ ప్రజాసంఘాల నాయకులు కె.నాగేశ్వరరావు, సిహెచ్.సుధాకర్, వజ్రాల వెంకటరెడ్డి, ఆర్.రమేష్ తదితరులు పాల్గొన్నారు.

## గ్రీన్‌ఫీల్డ్ హైవే సర్వే పేరిట రైతులకు అన్యాయం

**జి.కొండూరు :** కృష్ణాజిల్లాలోని తునికిపాడు నుంచి జక్కంపూడి గ్రామం వరకూ చేపట్టిన నాలుగు లైన్ల కొత్త హైవే రహదారికి రెండు వైపులా సర్వీసు రోడ్లు లేకపోవడంతో రైతులకు తీవ్ర ఇబ్బందులు ఎదురయ్యే పరిస్థితి వచ్చింది. ప్రజాభిప్రాయం జరిపి మెజారిటీ ప్రజల అభిమతం మేరకు భూ సేకరణ జరిపి హైవే నిర్మించాలని ఎపి రైతు సంఘం జిల్లా కార్యదర్శి పివి ఆంజనేయులు అన్నారు. హైవేపై ప్రజాభిప్రాయ సేకరణ సదస్సులో ఆయన మాట్లాడుతూ.. 2013 భూసేకరణ చట్టం ప్రకారం రైతులకు మూడు రెట్లు అదనంగా ధర ఇవ్వాలని డిమాండ్ చేశారు. అలా చేయకపోతే రైతులకు ఎంతో నష్టం చేకూరుతుందని అన్నారు. ఈ కార్యక్రమంలో ఎపి కౌలు రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పి.జమలయ్య తదితరులు పాల్గొన్నారు.

# వీరనారివై పోరాడు



- రెడ్డి శంకరరావు
సెల్ : 94 94 33 35 11

పల్లవి...
రా కదలి రా... కలిసిరా... తరలి రా
చేయి చేయి కలిపి నువ్వు శివంగిలా కదలిరా....
మద మెక్కిన మనువాదుల
మెడలు వంచ కదలిరా

చరణం...1
గృహ హింసను ఛేదించగ
గడ్డి పూచ లొకటిచేసి
కామాగ్నిని దహించగా
కాళికవై కదలిరా... 2

చరణం....2
అమ్మవై జన్మనిచ్చి
అక్కవై ఆదరించి
చెల్లివై చేర దీసి
ఓ మహిళా... రా... కదలిరా. 2

చరణం....3
మనసిచ్చి మనువాడి
జీవితమంతా... మగాడి చెంతా
ప్రేమ పక్షివై ...కలిసి గడిపినా
సమానత్వం లేకపోయే ...
రాక్షసుల రాజ్యంలో
ఈ రావణ కాష్టంలో
నలిగి నలిగి... పోతున్న
ఓ మహిళా... రా కదలి రా. 2

చరణం...4
సమానత్వ సాధన కై...
సమసమాజ స్థాపనకై
తల ఎత్తుకు తిరిగేందుకు
తల్లిలా... చెల్లిలా... అక్కలా..

సింహ నాదమై గర్జించాలి
వీరనారివై పోరాడాలి
ఝాన్సి రాణివై తిరగబడాలి
రా కదలి రా... రా కదలి రా... 2

# యుద్ధమెపుడూ అనర్థమే !



- జంధ్యాల రఘుబాబు
98497 53298

అధికారమైనా పగైనా
వెనుకనున్న కారణమేదైనా
యుద్ధమెపుడూ అనర్థమే
అనివార్యంగా చేసినా
అచేతనంగా పాల్గొన్నా
యుద్ధమెపుడూ అనర్థమే
నిర్మించుకున్న బహుళ సౌధాలైనా
నిలబెట్టాలనుకున్న సంస్కృతియైనా
అరచేతిలో పెట్టుకున్న ప్రాణాలైనా
క్షణంలో మాయమవ్వడమే
గాలిలో కలవడమే యుద్ధమంటే
యుద్ధమంటే శ్మశానమే
కాలే శవాల మధ్య భోజనమే
ఓడిన వాడు ఓడానని ఏడిస్తే
గెలిచినవాడూ ఆ గెలుపెందుకో
అర్థం కాక తానూ ఏడుస్తాడు
ఆ రక్తపుకూడు ఆనందపరిచేదెవరినో
తమది న్యాయమని వాదించినా
యుద్ధమెపుడూ అన్యాయమే
సత్యాసత్యాల జిలుగులు దిద్దినా
యుద్ధానంతరం అంతా చీకటే
యుద్ధం చివరికి మిగిల్చేది
గాఢాంధకారమైన కాళరాత్రినే!

# క్షతగాత్రం !



- డా. డి.వి.జి.శంకర రావు, మాజీ ఎంపీ,
94408 36931.

స్వార్థమే రాజ్యమేలుతున్న వేళ
సామ్రాజ్య వాదమే సాగుతున్న వేళ
రణమే సాధారణం.. శాంతి ఓ విరామం

ప్రపంచమే యుద్ధ రంగమైతే
ప్రారంభించిన వాడొక్కడే ముద్దాయి కాదు
ప్రేరేపించేవాడూ, ఆజ్యం పోసేవాడూ
అపరాధిని నిలదీయక,
చోద్యం చూసేవాడూ
అందరూ ముద్దాయిలేఊ

ఆత్మ రక్షణకో యుద్ధం
ఆయుధ విక్రయానికో యుద్ధం
దురాక్రమణకో యుద్ధం
పరాక్రమ ప్రదర్శనకో యుద్ధం
యుద్ధమో, యుద్ధానికి సన్నద్ధమో
అనుదినమూ తప్పని తద్దినం
యావత్ ప్రపంచమే క్షతగాత్రం!

Printed & Published by B. Tulasi Das on behalf of A.P. Rytusangam, 3/4B, Bypass Road, Vaddeswaram, Tadepalli, Guntur Dt, A.P.
At Prajasakti Daily Printing Press, Krishna nagar, Tadepalli (M), Guntur (Dt.,) Editor : P. NarasimhaRao



విద్యుత్తు కోతలకు నిరసనగా
కామవరపుకోట సబ్ స్టేషన్ వద్ద రైతుల ధర్నా



భీమసింగి ఫ్యాక్టరీని వచ్చే సీజన్ నుంచి నడపాలని కోరుతూ రాస్తారోకో



సాగునీరు ఇవ్వాలని కోరుతూ
కర్నూలు జిల్లా దేవరకొండలో రాస్తారోకో


చెరుకు కొనుగోలు చేయాలని కోరుతూ మునగపాకలో ధర్నా


ధాన్యం కొనుగోళ్లు చేయాలని కోరుతూ
విజయనగరం కలెక్టరేట్ వద్ద ధర్నా


ఉరవకొండలో రైతుల రాస్తారోకో


నాసిరకం జాదూ విత్తనాలపై వ్యవసాయ కమిషనర్‌కు వినతి


అకాల వర్షాలతో పంటలు పోయిన వారికి
సాయం చేయాలని కౌతాళం తహశీలులో వినతి

Book Post - Printed Matter

MANARYTUVANI R.NI. 52715/90



## మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M237 |
| పుస్తకం పేరు | రైతువాడి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | good |
| వెనుక అట్ట | good |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Radha |
| పేజీలు విడదీసినది | Radha |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |